GRIHALAKSHMI

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు:
డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౨౦] మే 1951 [సంచిక ౫




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

నేడే
విడుదల

కృష్ణవేణి,.. మాలతి
నారాయణరావు..
ముక్కామల.. నటించిన,



విజయలక్ష్మి వారి...

# పేరంటాలు

రచన, డైరెక్షన్. గోపీచంద్.



డిస్ట్రిబ్యూటర్లు:- ఆంధ్ర: గోకుల్ కృష్ణా ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ; సీడెడ, చిత్తూరు: జీవన్ ఫిలింస్, గుంతకల్లు; నైజాము: జగత్ పిక్చర్స్, సికింద్రాబాదు; మైసూరు: అమృత్ పిక్చర్స్, బెంగుళూరు; బొంబాయి: శ్రీనివాస్ పిక్చర్స్, గదగ్

ఇతర వివరాలకు: విజయలక్ష్మి ప్రొడక్షన్సు, మద్రాసు - 17

# వి ష య సూ చి క





స్వయంవరము.

చిత్రకారుడు : సి. యన్. వెంకటరావుగారు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# కీ॥ శే॥ విక్రమ దేవవర్మ గారు

శ్రీ రాజా విక్రమదేవవర్మగారు, జయపురం మహారాజులుంగారు 82-వ సం॥ ప్రాయమున కీర్తిశేషులైనారని వ్రాయుటకు చింతిస్తున్నాము.

పండితుడు, కవి, దాననిరతుడు, ఉత్తమశీలసంపన్నుడు, రాజర్షి పరమమిత్రుడు గతించినాడు. ఆయనలేమివల్ల ఆంధ్రదేశం పేదవడ్డదనవచ్చు. మహారాజుకాకముందు ఆయన ప్రధానరంగం వాఙ్మయప్రపంచమైనా, సాంఘికరాజకీయక్షేత్రాలకును అపరిచితులు కారు.

రాజ్యం చేతికిరాగానే, చిరకాలమునుండి తాను సేవించుచున్న సరస్వతికి కట్నం చెల్లించనారంభించారు. 1935 నుండి సాలుకు లక్షరూపాయలు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు చెల్లిస్తున్నారు. అంతేకాదు తన తదనంతరంకూడా ఆకట్నం అలా చెల్లుబడికాగలందులకు కోటపాడు యస్టేటును ప్రత్యేకించారుకూడ. ఆంధ్రజాతి శాశ్వతంగా కృతజ్ఞత చూపదగిన పని చేసినారు.

విద్యాపోషణలో స్త్రీవిద్యపట్ల ఆయన విశ్వవిద్యాలయమున మహారాణీ హీరాబాయిగారి పేరట విద్యార్థినులకు వసతిగృహముకట్టింప నేర్పాటుచేసినారు. ఇందుకు స్త్రీలోకమంతయు ఆయనను నిరంతరము కొనియాడగలదు.

జీవన్ముక్తులైయుండిన శ్రీవారి యాత్మకు ఇక పరమశాంతియే!

# కేసరి ప్రాథమిక పాఠశాలభవన

## ప్రవేశ మహోత్సవము

త్యాగరాయనగరమునందు నూతనముగానిర్మించబడిన కేసరి ప్రాథమిక పాఠశాలభవన ప్రవేశ మహోత్సవము ఏప్రిలు 19-వ తేదిన మహావైభవముగా జరిగినది. మహోత్సవమును జరుపవచ్చిన మద్రాసు ప్రభుత్వ ఆర్థికశాఖమంత్రి గా. బెజవాడ గోపాలరెడ్డి, కేసరి విద్యాలయముల వార్షికోత్సవమునకు అధ్యక్షత వహింపవచ్చిన మద్రాసు ప్రభుత్వ విద్యామంత్రి గా. కె. మాధవ మీనన్ గార్లతోపాటు శ్రీ బులుసు సాంబమూర్తి, మద్రాసు లెజిస్లేటివుకవున్సిలు ప్రెసిడెంటు ఆర్. బి. రామకృష్ణరాజు, మద్రాసు శాసనసభ డిప్యూటి స్పీకరు శ్రీమతి అమ్మన్నరాజా, శ్రీమతి కుట్టిమాలు అమ్మాళ్, ఆర్. సుబ్బయ్యనాయుడు, ఆర్. గోవిందరాజులు నాయుడు (లా కాలేజి ప్రిన్సిపాలు.), కె. సుబ్రహ్మణ్యం నాయుడు (సహకార సంఘాల జాయింటు రిజిస్ట్రారు.), సి. నరసింహం (మద్రాసు కార్పొరేషను కమీషనరు), పట్టాభిరామయ్య (స్మాలుకాజుకోర్టుజడ్జి), వి. రాధాకృష్ణయ్య, వి. నటరాజ్ (అడ్వకేట్లు) డా. వై. యస్. నారాయణరావు (డైరెక్టరు కింగ్ యిన్స్టిట్యూట్), ఎ. రాఘవరెడ్డి (చైర్మన్ ఇంప్రువుమెంటుట్రస్టు.), సి. జి. రెడ్డి (లేబరు కమీషనరు)గార్లు, యితరపుర ప్రముఖులు ఉత్సవములో పాల్గొనిరి.

మేనేజింగు కమిటీవారు అన్ని ఏర్పాటులు చక్కగా చేసిరి. సాయంకాలము నాలుగుగంటలనుండి ఉత్సవములో పాల్గొనుటకు స్త్రీలు, పురుషులు, బాలబాలికలు బహుసంఖ్యగా పాఠశాల ఆవరణలో చేరిరి. ద్వారమువద్ద స్త్రీ పురుషులు చందన పుష్పాదులతో సత్కరించబడిరి. చక్కగా నమర్చబడిన వేదికపై శ్రీ గోపాలరెడ్డి, మాధవ మీనన్, కుట్టిమాళు అమ్మాళ్ గార్లు ఆసీనులై 5-30 గం॥లకు మహోత్సవ కార్యక్రమము ప్రారంభమయ్యెను.

శ్రీ మైదవోలు శేషాచలపతి (పూర్వపు కేసరివిద్యాలయపు కార్యదర్శిగారు) తన స్వాగతోపన్యాసములో యిట్లు చెప్పిరి.

"మేనేజింగు కమిటీ అధ్యక్షులయిన శ్రీ సర్. అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారు అనివార్య కారణం వలన రాజాలకపోయినందున వారి తరఫున హృదయపూర్వకమైన స్వాగతముచెప్పుట నావంతైనది. తీరిక చేసికొని మీారెల్లరు వచ్చినందుకు కృతజ్ఞులము. కార్యభారమువలన తీరికలేనప్పటికి మంత్రివర్యులిద్దరు ఈ మహోత్సవము జరుపవచ్చినందులకు వందనములు. వారిని గురించి విశేషముగా చెప్పనవసరములేదు; ప్రజాసేవలో వారు కీర్తి ప్రశంసలు విస్తారముగా సంపాదించినవారు.

గో. రాళ్లగా విసరింపుకొనుచున్నాము.

శే. కాని దానిని సౌకర్యముగా పూలమాలలుగా పరివర్తనము గావింపవచ్చును.

# కేసరి ప్రాథమిక పాఠశాల భవన ప్రవేశ మహోత్సవము



ఈ విద్యాలయములు ఏర్పడుటకు శ్రీ కేసరిగారు కారకులు. వారు ఆరోగ్యనిమిత్తమై స్థళాంతరమునకు వెళ్ళియున్నందున రాజాలరైరి. వారు వ్యక్తిగతంగా యిచ్చట లేకున్నను మానసికంగా నిచ్చట నున్నట్లే. వారు యింతవరకు విద్యాలయములకై గావించిన, కావించనున్న సహాయమునకు యీ సొసైటీ వారు సదా కృతజ్ఞులు.

ఇప్పుడు ప్రవేశింపబడనున్న భవనమునకు గతసంవత్సరము గౌ. సీతారామిరెడ్డిగారు శంఖుస్థాపన మొనర్చిరి. ఇంత త్వరగా భవన నిర్మాణము పూర్తియగుటకు కారణం దాతలభూరి విరాళములు, శ్రీ బండి శ్రీ హరిరావు నాయుడుగారి అసంతిత దక్షత, శ్రమయని ముగించుచు ఆనాటి ఉత్సవ కార్యక్రమమునకు శ్రీ. కె. మాధవమీనన్‌గారిని అధ్యక్షత వహించవలసినదిగా కోరిరి.

శ్రీ గోపాలరెడ్డి, మాధవమీనన్‌గారలు జయజయ ధ్వానములమధ్య పుష్పమాలాలంకృతులైరి. శ్రీ మాధవమీనన్‌గారు అధ్యక్ష పీఠము నలంకరించి ప్రారంభోపన్యాసమున నిట్లు జెప్పిరి.

"నాకీ అవకాశమిచ్చినందులకు మీకెల్లరకు కృతజ్ఞుడను. శ్రీ కేసరిగారుచూపిన వితరణకు వారినభినందించుచున్నాను. వారు యిచట లేనందుకు చింతిల్లుచు వారికచిరకాలములోనే పూర్ణారోగ్యము కల్గుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నాను.

మద్రాసు నగరమును గురించిన వివాదాంశములతో నాకు పనిలేదు కాని యిచ్చట అన్ని భాషల వారుండుటచే వారందరికి వారివారి భాషలలో విద్యాబోధన చేయుటకు ప్రభుత్వమువారు ఏర్పాటుచేసి యున్నారు. అందుకని పాఠశాలలో యిందరు విద్యార్థులు ఆ భాషను చదువువారుండవలెననెడి నియమముకూడ ఏర్పరచబడినది. అయినా తెలుగువారికి తమకు సౌకర్యములు చాలవను అసంతృప్తికలదని నాకు తెలియును. అట్టి అసంతృప్తి బాపుటకు శ్రీ కేసరిగారివంటి దాతలు పూనుకొనుట ప్రశంసాపాత్రము. పూర్తిగా ప్రభుత్వముమీద నాధారపడుట వాంఛనీయముకాదు. భాషావివాదంమాని భాషను విజ్ఞానాభివృద్ధికి, ఒకరినొకరు అర్థము చేసికొనుట కుపయోగించుకొనవలెను."

మేనేజింగుకమిటీ కార్యదర్శిగారగు రావు బహదూరు బండి శ్రీ హరిరావునాయుడుగారు కేసరి విద్యాలయముల వార్షిక నివేదికను చదివిరి. (దానిని మరొకచోట ప్రచురించియున్నాము.) తర్వాత కేసరిగారు పంపిన సందేశమును యీ క్రింది విధముగా చదివిరి.

శ్రీ కేసరి విద్యాసంఘకమిటీ సెక్రటరిగారయిన శ్రీ బండి. శ్రీ హరిరావునాయుడుగారికి, కేసరి నమస్కరించి వ్రాయు విన్నపములు:—

కేసరి ప్రాథమిక పాఠశాలభవన ప్రవేశము, విద్యాలయముల వార్షికోత్సవ ఆహ్వాన పత్రిక అందినది. సుదినమని సంతసించితిని.

ఆ ఉత్సవ సమయమునకు రాదలచుకొన్ననూ, ప్రయాణప్రయాసలకు సహించజాలనేమోయని సందేహముతో రాజాలనైతిని.

శరీరము మాత్రమే యిచ్చట వున్నదికాని నా అంతరాత్మ మీ మధ్యనే యున్నదని భావించకోరుతాను.

శ్రీ. గౌ. మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు, గౌ. శ్రీ కె. మాధవ మీనన్‌గారు అధ్యక్ష పదవుల దయతో నంగీకరించినందులకు అపరిమితానంద భరితుడనైతిని. విద్యాలయముల అభివృద్ధి నిమిత్తము సర్వదా వారు తోడైయుండవలయునని నా ఆశయము.

శ్రీ హరి అనుగ్రహముండిన ఈ చిన్న పాఠశాలవలెనే, ఉన్నత పాఠశాల, కళాశాల, యీ రెండును కూడ యిచ్చటనే నిర్మింప కుతూహలపడుచున్నారము. అయితే సభాసభ్యులందరి సహాయముండవలయునని కోరుచున్నాను.

కమిటివారికి సభాసభ్యులందరికి నావందనములు.

ఇట్లు విధేయుడు,
కె. ఎన్. కేసరి

కేసరిగారు సందేశముతోబాటు పాఠశాల ఉపయోగమునకై బహూకరించినగంట ప్రదర్శింపబడినది.

శ్రీగోపాలరెడ్డిగారు కేసరిప్రాథమికపాఠశాలభవన ప్రవేశమహోత్సవముజరుపుచు యిట్లుపన్యసించిరి.

“శ్రీ కేసరిగారు తెలుగు బాలబాలికల విద్యాభివృద్ధికై చేయుచున్నకృషి ప్రశంసనీయము. ప్రజలు కూడ విద్యాసౌకర్యములకై పూర్తిగా ప్రభుత్వముమీదనే ఆధారపడక స్వశక్తి, సామర్థ్యములతో కృషి చేయవలెను. కేసరిగారివంటి దాతలవలన సంఘం సర్వతోముఖాభివృద్ధి నందగలదు.

కేసరిగారి సందేశములోనున్నట్లు యీ పాఠశాల అచిరకాలములోనే కాలేజిఅయి తెలుగు బాలబాలికలకే కాక యితరభాషా బోధనకుకూడ అవకాశము ఏర్పడునని ఆశించుచున్నాను.

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సర్వవిధముల సహాయపడిన శ్రీ జయపూరు మహారాజావారి ఔదార్యము ప్రశంశించతగినది. ధనవంతులు విరివిగా దానధర్మములుచేసి సంఘశ్రేయస్సుకు పాటుపడుటమంచిది. ఈనాడు కాకపోయినను, కొంత కాలమునకైన వారివారి ఆస్థులలో కొంత భాగము ప్రభుత్వమువారు సంక్రమింపజేసికొనుటకు నిర్ణయమగుట తథ్యము.”

మహారాజశ్రీ యీ సంస్థ అభివృద్ధికి ప్రజాసహకారము నర్థించుచు, బాలబాలికలు వివిధప్రాంత్యములనుండి పాఠశాలకు వచ్చుటకు ఒక మోటారువాన్ అవసరమనియు, దానిని ప్రభుత్వమువారైన సమకూర్చవలెననియు కోరిరి.

కేసరి విద్యాలయములందలి బాలబాలికలు సరస్వతి ప్రార్థన, గృహప్రవేశం, బొమ్మరిల్లు నాటికలు, నృత్యగానములతో సభాసదులను ఆనందభరితులనుచేసిరి. కేసరి హైస్కూలు విద్యార్థులను తరిఫీదుచేసిన శ్రీ న్యాయపతి రాఘవరావు, కామేశ్వరమ్మగార్లు, ప్రాథమిక పాఠశాల విద్యార్థులను తరిఫీదుచేసిన శ్రీమతి అన్నపూర్ణమ్మ (హెడ్ మిస్ట్రెస్) లక్ష్మమ్మ (ఉపాధ్యాయిని)గార్లు ప్రశంసాపాత్రులు.

శ్రీమతి అమ్మన్నరాజాగారు ఆటల పోటీలలోను, నృత్యగానములలోను చక్కగా నిర్వహించినవారికి బహుమతులు పంచిపెట్టిరి.

---

# శ్రీ శారదా మహిళా విజ్ఞాన సమితి

ప్రారంభోత్సవము

భాపట్ల



16-4-51 వ తేదీ సాయం కాలం శ్రీ సరస్వతీ మెమోరియల్ గరల్స్ హైస్కూలు భవనావరణంలో శ్రీమతి పేరిసర్వలక్ష్మమ్మ B. Sc. (అగ్రికల్చరల్ కాలేజి అసిస్టెంటు లెక్చరరు) గారి అధ్యక్షతను, రాజమండ్రి వాస్తవ్యురాలు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు ఆంధ్ర యువతీసంస్కృత కళాశాలా ప్రిన్సిపాలుగారు శ్రీ శారదా మహిళా విజ్ఞాన సమితి ప్రారంభోత్సవమును చాలా వైభవంగా జరిపిరి.

బాలికల ప్రార్థనానంతరం శ్రీ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు అధ్యక్షు, గాయక, ఉపన్యాసకుల గూర్చి సభాసదులకు ఎరుక చేశారు. తరువాత శ్రీ బత్తుల కామాక్షమ్మగారి ఉపన్యాసము, శ్రీ పేరి సర్వలక్ష్మమ్మగారి ఉపన్యాసము జరిగినవి.

తరువాత కార్యదర్శిని స్థాపకురాండ్ర నివేదిక చదవడమైనది. కులమత వివక్షలకు, తావులేని ఆశయాలతో ఈ సంస్థ స్థాపింప బడిందని, కాలంతో బాటు కలుగుతూన్న మార్పుల ననుసరించి స్త్రీ సంఘంలో లోపాలను సవరించుకొంటూ అన్ని విధములైన కార్య ప్రణాళికలతో ఈ సంస్థ నడిపింప బడుతుందనీ, విజ్ఞానప్రదములైన చర్చలూ, గోష్ఠులూ, సమావేశాల ద్వారానున్నూ విజ్ఞానం చైతన్యం కల్గించడానికి అన్ని విధములా ప్రయత్నించడమే ఈ సమితి ఆశయమనిన్నీ నివేదికలో సూచించారు. ఉత్తరోత్తరా ఈ సమితి పక్షాన ఒక అనాధ బాలికా శరణాలయం స్థాపింప దలచినట్లు కూడా తెలియజేయబడినది.

అనంతరం శ్రీమతి కామాక్షమ్మగారు స్వస్తివాచకములు పల్కిరి. ఆ శుభసమయంలోనే శ్రీ విజయనగరం మహారాజా సంగీతకళాశాలా నాట్యాచార్యులు శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారి అధ్యాపకత్వంలో వేసంగి పాఠశాలగా ఒక నాట్యం తరగతి కూడా ప్రారంభింపబడినది.

శ్రీయుత చీరాల బాలకృష్ణమూర్తిగారు శ్రావ్యమైన కంఠంతో కర్ణాటక సంగీతాన్ని క్రొత్త పద్ధతులతో పాడి వినిపించి సభ్యులను ఆనందపరచినారు.

గుంటూరు వాస్తవ్యులు శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారు నాట్యమాధుర్యాన్ని గూర్చిన్నీ, స్త్రీల సంఘాల కర్తవ్యాన్ని గూర్చిన్నీ, గంభీరంగా ఉపన్యసించారు.

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి గారు కూడా కడుశ్రమకోర్చి విజయవాడనుండి ఏతెంచి ప్రస్తుత నాగరికతలోని లోపాలను గూర్చి, పూర్వకాలం నాటి మన ఉత్తమ సంస్కృతిని గూర్చిన్నీ మధురంగా అభిభాషణం చేశారు. అధ్యక్షుల అంత్యోపన్యాసంతోనూ, వందనసమర్పణంతోనూ, జయగీతికతోనూ సభముగిసింది. ఊళ్లో పెద్దలు స్త్రీలు పురుషులు విచ్చేసి సమితిని నాశీర్వదించారు. సమితి కార్యోద్దేశాలకంతా సంతసించారు.

దేవత రామలక్ష్మమ్మ.

# తెలుఁగు నాఁడు



[ధర్మచక్రమును రాజ్యపాలనాదేవిగాఁబోల్చి తెలుగునాడును గురించి చెప్పుట]

సకల సాహిత్యలోక భాస్కరుఁడు కృష్ణరాయలు పెనిచిసాకిన రాచగడ్డ
మావిజయనగరాంధ్ర సీమను జెదరిన తెల్గుసోయగ మొగఁబోసి దిద్దుమమ్మ!
ఆంధ్రశారద తన్నగరాంతరమునఁ బైఁడిటంకాలు జెలిఁగిన బాటలందు
మసలుచున్నదిప్పటికిని మఱుఁగువడకఁ దెల్గురాజుల నునుకత్తి వెల్గుఁజాటి.
ఉష్ణరుధిరాబ్ధిలో మున్గియాడికిపోయె తెలుఁగువారల భాగ్యముల్ తెట్టగట్టి
కస్తిగూర్చుచు సామ్రాజ్య గర్భభూమి దాగియున్న నాఁటి తెలుఁగుఁదనమువిన్న.
కాళిదాసుని కావ్యకన్యకాంఘ్రి ద్వయార్చనసేవలో విరుల్జల్లినిలిచెఁ
బాల్కురిసోమన్న పదకవిత్వము మెచ్చి ఘంటాగ్రముననాడె గజ్జెగట్టి
కవిసార్వభౌముని కాలియందలి యందెఘల్ఘల మ్రోఁతలఁగళలనీనె
తిక్కయ్యనాఁనుడి తెలుఁగుగంటలుమ్రోయ దివిటీలు బట్టించి తిరిగెదిశలఁ
పైఁడిపల్లకి కొమ్మునుఁబట్టియెత్తి విజయవిద్యానగరమందు వీణమీటి
కటకటా! క్రుంగిపోయెను కడకు నిచట తెలుఁగుతల్లి లేఁబ్రాయంపు వెలుఁగుఁబ్రొద్దు.
మత్తకరీంద్రంబు మావటీని నుడిలో నడుగుదప్పినజాడ నరయలేదు
కోటవాకిలిఁగాయు మేటి బంటొకరుండు మాటమాత్రిప్పినమాటఁ బడయలేదు
పగతుఅకూఁతుని భార్యగాఁబడసిన ప్రజ్ఞావిశేషంబు బాయలేదు
ఆంధ్రజాతికి ఎన్నె సమరదిద్దిన తెలుఁగు కత్తిపదును తొలఁగలేదు
ఆంధ్రభూయిష్ఠమైన యాంధ్రాన్వయమునఁ గొఱఁతలేమికి సంపదల్ గూడబెట్టి
దేశపరిపాలనావిధుల్ దీపింప దిక్కులేలినవాఁడు మా తెలుఁగువాఁడు.

సహజ విద్యాసరస్వతికి బాష్పముతుడ్చి గంధాక్షతలు జల్లెఁగవివరుండు
నీలకంఠములకు నృత్యంబునేర్పెడి గాంధర్వమునుఁ బల్కె గాయకుండు
కలఁకురాబండలు నెఱిమార్దవముజెంద సృష్టిచిత్రముఁజెక్కె శిల్పిఘనుఁడు
తనభావగీతిలో దైవతార్చనసేసి పండించెనాత్మను పరమయోగి
ఆంధ్రశారదయాడిన యాటలందుఁ గులికి నవ్వినవాఁడు మా తెలుఁగువాఁడు
జంటసిరులనుదోఁగాడి మింటనిల్పి దిశలమెఱపించినాఁడు మా తెలుఁగువాఁడు.

తెలుఁగుజాబిల్లి వెన్నెలవ్వెలుఁగునాఁడు తెలుఁగుబెత్తాలుజేపట్టి తిరుగునాఁడు
తెలుఁగు సంప్రజంబు దెప్పలన్ దేలునాఁడు తెలుఁగు వీణియమీటిన దినములందు
నమరపట్టణమేకదా! యాంధ్రభూమి.

తెళ్ల వేంకటరామారావు.

(0)

# కేసరి స్కూళ్ల వార్షిక నివేదిక

# 1950–51



కేసరి హైస్కూలు నిర్వాహకులు త్వరలో ముగియనున్న ఈ సంవత్సరమున ఈ సంస్థలు గావించిన పనిపాటులనుగూర్చిన రిపోర్టును ప్రకటించుటకు మిక్కిలిగా సంతోషించుచున్నారు.

1951 ఫిబ్రబరిలో కేసరిహైస్కూలును, అందుకు సంబంధించిన ఇతర సంస్థలను నిర్వహించే కమిటీ నిర్మాణమున చాలముఖ్యమైన మార్పుకలిగినది. కేసరి హైస్కూలు, దానికి సంబంధించిన ఇతర సంస్థలు అనే వాని వ్యవహారములను పరిపాలించుటకు, వానికొరకు ఆస్థులను సంపాదించుటకు, ఈ సంస్థల కార్యకలాపముల స్వభావమును అవకాశములను క్రమముగా విస్తరింపజేయుటకు 1860 సం॥ 21 ఆక్టు ననుసరించి ఒక రిజిస్టర్డు అసోసియేషన్‌ను ఏర్పరచుట మంచిదని అనేక కారణములచే తలంపబడెను. ఆకారణముచే – యథోచితముగా "ది కేసరి యడ్యుకేషన్ సొసైటీ" అని యొకసంస్థ ఏర్పరుపబడెను. ఆ సంఘమునకు ఏడుగురు సభ్యులుగల పరిపాలకవర్గము గలదు. ఈ సంస్థలను, వానికిచెందిన ఆస్థులు, ధనము అనే వానినన్నిటిని పరిపాలించి నిర్వహించుభారము ఆపరిపాలకవర్గమువారియందు నిక్షిప్తమైనది.

ఈ సొసైటీ భాగ్యవశమున శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్‌గారు దాని కధ్యక్షులుగాను, ది. హా. జస్టిస్. శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు కోశాధిపతులుగను, దివాన్‌బహుదూరు శ్రీ బండి శ్రీహరిరావునాయుడుగారు కార్యదర్శి, స్కూళ్ల కరెస్పాండెంటుగను అమరియున్నారు. ఈ సందర్భమున పరిపాలకవర్గమువారు మున్ను, కరెస్పాండెంటుగా పనిచేసియున్న రిటైర్డు డిస్ట్రిక్టు యడ్యుకేషనల్ ఆఫీసర్ శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారి అమూల్యమగు సేవను మిక్కిలిగా కొనియాడుచున్నారు.

పరిపాలకవర్గమువారు తమ అధీనములలోనున్న వివిధ సంస్థలను పరిపాలించు సందర్భమున ఆయాస్థలములలోనున్న పెద్దల సహకార సహాయములు సేకరించుటకై స్థానికముగా కమిటీల నేర్పరచే అధికారమును తమకు రిజర్వుచేసుకొనియున్నారు. ఈ సొసైటీని ఏర్పరచుటకు స్థాపకులు హృదయపూర్వకముగా అంగీకరించియున్నారు.

ఈ రిపోర్టుకు సంబంధించిన సంవత్సర కాలములో కేసరి హైస్కూలువారు మామూలు విద్యావ్యాసంగములును, ఉపరికార్యక్రమమును (Extra curricular work) నడిపించియున్నారు. 1950 జూన్ నెలలో శ్రీ కె. వెంకట్రాజుగారు ప్రధానోపాధ్యాయులుగా నియమింపబడిరి; తదాదిగా వారాపనిలోనున్నారు. స్కూలు ఉపాధ్యాయవర్గమున ప్రస్తుతము 3 గురు ఎల్. టీలు; వారిలో నొక్క నారీమణియుకలదు. 3 గురు ట్రెయినింగుకాని పట్టభద్రులు, 8 మంది సెకండరీ గ్రేడ్ ట్రెయినింగ్ టీచర్లు, ఒక ఎలెమెంటరీ గ్రేడ్ టీచర్, ఒక డ్రాయింగు టీచరు, ఒక వ్యాయామ శిక్షకురాలు, ఒక తెలుగుపండితుడు, ఒక సంస్కృతపండితుడు, ఒక హిందీపండితుడు, ఒక తెలుగు పండితురాలునుగలరు. ప్రభుత్వమువారు నిర్ణయించిన ప్రకారమే వీరి జీతనాతములు, ఉద్యోగపుషరతులు నిర్ణయింపబడియున్నవి.

ప్రస్తుతం ఈబడిలోగల విద్యార్థులసంఖ్య 549; వీరిలో 174 గురు బాలికలు. 1950 సం॥ అంతమునుండి విద్యార్థులసంఖ్య పెరుగజొచ్చినది; తగిన స్థళవసతి యుండినచో ఇంకను సంఖ్య హెచ్చియుండేది.

విద్యాశాఖలు.

ఎస్. ఎస్. ఎల్. సి. స్కీమునననుసరించి విద్యాశాఖలు ఏర్పాటుచేయబడినవి. అన్నితరగతులలోను బోధనా సాధనము తెలుగుభాష. 4, 5, 6 ఫారములలో తెలుగు భాషకు ప్రత్యామ్నాయముగా సంస్కృతమునకు అవకాశమేర్పడుపబడినది. ప్రథమభాష యొక్క రెండవ భాగముగా 1 ఫారములోనే సంస్కృతము ఏర్పాటైయున్నది. 1 ఫారము మొదలు 3 ఫారమువరకు 3 వ భాషగా హిందీని విద్యార్థులందరు నేర్చుచున్నారు. మూలమగు చేతిపనిగా నూలువడుకుట నేర్పబడుచున్నది.

ఆటలు

గత సం॥ మున నివేదికలో చెప్పబడినట్లుగా 5 ఎకరముల భూమిని విద్యార్థులకు ఆట స్థళముగా నుపయోగపడుటకై అద్దెకుతీసుకొనబడినది. అందలి కొన్ని భాగములలో ఆక్రమణచేసియున్నవారిని తొలిగించి వానిని స్వాధీనపరచుకొనుటకై మా నేజిమెంటు వారు తీవ్రముగా పనిచేయుచున్నారు. ఎమ్. ఎస్. ఏ. ఏ (మద్రాసుస్కూల్సు అథ లెటిక్ అసోసియేషన్) వారితో నీస్కూలు అనుబంధముగా చేర్చుకోబడినది. జోనల్

పోటీపందెములలో క్రికెట్, ఫుట్‌బాలు పందెముల నీస్కూలుపోటీ చేసియున్నది. ఎమ్. ఎస్. ఏ. ఏ స్పోర్ట్సులో మావిద్యార్థులు ప్రశంసాపత్రములను పొందియున్నారు. శ్రీ సి. హెచ్. సత్యానందంగారనే ట్రెయిన్డ్ టీచరు వ్యాయామ శాఖను నడుపు చున్నారు. విద్యార్థినులకు శ్రీమతి యస్. జయలక్ష్మిగారు వ్యాయామశిక్షణము నిచ్చు చున్నారు. స్కూలులో ఫుట్‌బాలు, క్రికెట్, బేస్‌బాలు, బాడ్‌మెంటన్ ఆటలు నేర్చు కొందురు.

వాఙ్మయ సంబంధమగు పోటీలు.

మా విద్యార్థులు సోదర విద్యాసంస్థ లేర్పాటుచేసిన వాఙ్మయసంబంధమగు పోటీలలో పాల్గొని సమర్థులని ప్రశంసాపత్రముల నందినారు. ఆలిండియా రేడియో వారేర్పాటు గావించిన బృందగాన ప్రసారములోను మా విద్యార్థులు పలువురు పాల్గొని యున్నారు.

దృశ్య విద్యాబోధనము.

గడచిన సంవత్సరమున ఫిలుములు చూపబడినవి. విద్యార్థులకవి యెంతో విద్యా బోధకముగాను నుండెను.

ఎస్. ఎస్. యల్. సి ఫలితములు.

1950 మార్చిలో ఎస్. ఎస్. యల్. సి పరీక్షకు కూర్చున్న విద్యార్థులు 46 గురు. వారిలో 24 గురు ఉత్తీర్ణులైరి. అనగా దామాషా 100 కి 52. ఈదామాషా చెన్నపురియందుగల ఇతర స్కూల్ల ఫలితములతో పోల్చిన మిన్నగానున్నదని చెప్పుటకు మా నేజిమెంటువారు సంతసించుచున్నారు.

తనిఖీ.

1951 జనవరి నెలలో విద్యాశాఖాధికారు లీస్కూలును తనిఖీచేసియున్నారు; పని సంతృప్తికరముగా నున్నదని వారు అన్నారు. వారి సూచనలనన్నిటిని సరిగా పాటించుచున్నాము.

1949 జూన్ నెలలో త్యాగరాయనగరమున ఎలిమెంటరీ స్కూలు ప్రారం భింపబడినది. ఈ యత్నారంభమునకు మూలకారకులు ముఖ్యముగా త్యాగరాయ నగరవాసులైన మహారాజ శ్రీ, సామి వెంకటాచలంశ్రేష్ఠి, పంచాగ్నుల సూర్య నారాయణ, నేతి సుబ్రహ్మణ్యంగార్లవంటి ప్రముఖులే. డాక్టరు కేసరిగారు తిరుగా తమ

సహాయమును వాగ్దత్తమొనర్చిరి; వారట్లు గావింతురని అందరికి విశ్వాసమే. ఆయన అప్పుడట్లు కలుగజేసుకొననట్లైతే, ఎలిమెంటరీ స్కూలు ప్రారంభించుట కేసరీ హైస్కూలువారి శక్తికిమించినపని. అయితే, నాటినుండి ఆస్కూలు చకచక వృద్ధికి వచ్చినది. ఈ సంవత్సరమున స్కూలులో విద్యార్థుల సంఖ్య 93 నుండి 113 వరకు పెరిగినది. వారిలో 45 ఆడపిల్లలు; 14 గురు హరిజనుల బిడ్డలు. నేడు గృహప్రవేశోత్సవము జరుపబడుచున్న భవననిర్మాణమున కనువైన ఈవిశాలమగు స్థలము ధరఖాస్తుపై పొందుటకు అవకాశముకల్గెను. చాలమందిదాతలు ఇచ్చిన భూరివిరాళములవల్లనే ఈ భవననిర్మాణము సాధ్యమైనది; వారి వితరణకు కృతజ్ఞతను వెల్లడించుచున్నాము. ఆదాతలపేరులను ఈ రిపోర్టు చివర ప్రకటించుచున్నాము. ఈ విరాళములు చాలవరకు నగరమందలి పెద్దలవల్లనేయైనను ప్రత్యేకముగా పరిగణింపదగు నొక్క విరాళమును గలదు. కీ. శే. బారిస్టరు కొనుమిల్లి జగ్గారాయుడుగారి భార్య శ్రీమతి వెంకట నరసమ్మగారు. పశ్చిమగోదావరి ఏజన్సీలోని కన్నాపురం ఆమె నివాసము. ఆమె ఈ ఎలిమెంటరీ స్కూలునారంభించుటనుగూర్చి, దీనికై శ్రీ దివాన్ బహదూరు బండి శ్రీహరిరావునాయుడుగారు పాటుపడుచుండుటనుగూర్చి పత్రికలందు చూచినది. శ్రీహరిరావునాయుడుగారి నామె తండ్రియే చిన్నతనములో చదివించినది. అడుగకుండానే, ఆమె, తనతండ్రి కీ. శే. గెడాగరటయ్యగారిపేర నొకగది కట్టించుమని రు 4000 ల భూరివిరాళమునుపంపియున్నారు. రు 4000 అంతకుమించి విరాళమిచ్చిన దాతలయెడ కృతజ్ఞతా సూచకముగా ఏదే నొక్కగదికి వారిపేరుపెట్టి, విస్తృతమైన వారి వారి ఛాయచిత్రముతో నాగది నలంకరించుటకును మేనేజిమెంటువారు తలపెట్టియున్నారు. మైలాపూరునందు సత్యానారాయణ బ్రదర్సువారు సమర్థులైన కంట్రాక్టర్లు; కాని ఈభవన నిర్మాణములలో అంతకన్న చాల అతిశయమైన శ్రద్ధాభక్తులు చూపించియున్నారు. వారు ఒకగదికి వలయునంత విరాళమునుగూడ ఇచ్చియున్నారు. ఇందుకేగాక, ఇంత అందచందములతోనిండి కొద్దికాలములో నీభవనమును నిర్మింపగల్గినందులకును వారియెడల మేనేజిమెంటువారు కృతజ్ఞులైయున్నారు.

కొన్ని సంగతులు పలుమారు ప్రస్తావింపబడవలసియుండును. మేము, మేమేయేల- మద్రాసు నగరవాసులైన తెలుగువారెల్లరు డాక్టరు కే. యన్. కేసరిగారికి ఋణస్థు

లనుమాట అట్టివానిలో నొకటి. తెలుగువిద్యార్థులకై ఏర్పాటైన ఒక విద్యాలయమునకు ఆదరణ అత్యవసరమైయున్న క్లిష్టసమయమున ఆయన ముందునకువచ్చి దానినాదుకొన్నారు. ఆయన కేసరి హైస్కూలు నారంభించి దానికి రు 70,000 ల భవనము నొసంగినారు; దానితోపాటు మరి రు 50,000 రొఖమునిచ్చినారు. ఇంతటితో యూరకొనక, 1947 లో కేసరి కన్యావిద్యాలయమనే పేరనొక బాలికోన్నత పాఠశాలను నెలకొల్పుటకై 1 లక్షరూపాయలను విరాళమిచ్చియుండిరి. ఇవి మహోజ్వలమగు దానధర్మములు; ఇవి నిజముగా చాల నిరాడంబరమగు సేవానిరతితో గావింపబడినవి. డాక్టరు కేసరిగారు తమకు అస్వస్థతగానున్నను, ఈవిద్యాలయముల పనిపాటులందును, అభివృద్ధియందును ఎంతయో శ్రద్ధాసక్తులను చూపుచున్నారు. ఆయన అచిరకాలముననే సంపూర్ణారోగ్యవంతులై మామూలు కార్యకలాపముల నడుపుకొందురుగాకయని మేనేజిమెంటువారు ఈశ్వరుని ప్రార్థించుచున్నారు.

రాగల స్కూల్ల సంవత్సరారంభమునుండి దీనిని హైయర్ ఎలిమెంటరీ స్కూలు గావింపవలయునని మానేజిమెంటువారి సంకల్పము. అచిరకాలముననే ఇది హైస్కూలు గావింపబడుటకు వీలగుననియు వారి ఆశ. మద్రాసునగరమందలి వయోజన విద్యాశాఖాధికారికి వారి పనులకు త్యాగరాయనగర భవనమునుపయోగించుకోవచ్చునని అంగీకరించిరి. ఈవిధముగా తెలుగువారియందేగాక, తమిళము మున్నగుభాషల మాట్లాడు వారియందు విద్యావ్యాప్తికల్గుటకు తోడ్పడుటయగునని మానేజిమెంటు వారి సంతోషము.

డాక్టరు కేసరిగారొసర్చినవి భూరివిరాళములైనను, మద్రాసునగల వితరణ శీలురందరును ఈవిద్యాలయములకై అతిశయమైన ధనసహాయ మొనర్చుట విడువక సాగించవలయునని ఈ మానేజిమెంటువారి కోరిక. దానము వడయుటకు విద్య అర్హమైనది. అందు భాషావర్గ విభేధములకు తావులేదు. తమ కోరిక అర్హరీతిని మన్నింపబడునని మానేజిమెంటువారి ఆశయము.

దాతల పేర్లు.

1. శ్రీ పి. గోవిందరాజులనాయుడుగారు రు 5000 లు
2. శ్రీ మీర్జాపురం రాజాసాహెబ్ వారు రు 5000 లు
3. శ్రీ సి. ఎస్. లోకనాథమొదలియార్ గారు రు 4000 లు
4. శ్రీ సి. హెచ్. సత్యనారాయణ బ్రదర్స్, కంట్రాక్టర్లు రు 4000 లు
5. శ్రీ కానుమిల్లి వెంకటనరసమ్మగారు రు 4000 లు
6. శ్రీ చల్లపల్లి రాజాసాహెబ్ వారు రు 1500 లు

(1–5: వీరిలో నొక్కొక్కరి పేర ఒక్కొగదివంతున కట్టించుట కగు ఖర్చు.)

7. ది రేస్ క్లబ్బు, మద్రాసు రు 1000 లు
8. శ్రీ టి. యస్. సుందరంగారు రు 1000 లు
9. శ్రీ వీరరాఘవులు శెట్టిగారు రు 1000 లు
10. శ్రీ యం. ఆర్. రాజగోపాలనాయుడుగారు రు 1000 లు
11. శ్రీ యన్. ఆర్. బాలకృష్ణనాయుడుగారు రు 1000 లు
12. శ్రీ రావురెడ్డిగార్లు రు 500 లు
13. శ్రీ టి. ఏ. రంగాచారిగారు, అట్టార్నీ రు 500 లు
14. శ్రీ పి. సూర్యనారాయణగారు రు 500 లు
15. శ్రీ జి. యస్. రెడ్డిగారు రు 200 లు
16. శ్రీ పి. రాజారెడ్డిగారు (తిరుపతి) రు 116-లు

17, 18. నేతి సుబ్రహ్మణ్యంగారు, సామి వెంకటాచలం శెట్టిగారు చెరి వొక రు 650 లు ఇచ్చుటకు వాగ్దానము చేసిరి.

శ్రీ కుట్టిఅండ్ రావు, యలెక్ట్రికల్ ఇంజనీయర్లు దయతో ఉచితముగా భవనమునకు ప్రదేశమునకు విద్యుద్దీపముల నమర్చిరి.

ఆడిటర్ శ్రీ కె. వి. సుబ్బయ్యనాయుడుగారు, శాపిత్రవిష్వం చుటకయ్యే ఖర్చంతయు భరింతుమనిరి.

గుప్తదాతలుగా నుండగోరు మరొకమిత్రులు, భవనమున కవసరమైన మంచినీటి వసతి, ఆరోగ్యసంరక్షకవసతులు మున్నగువానికగు ఖర్చు మొత్తము నిత్తుమనిరి.

ఇండియన్ రిపబ్లిక్ మ్యానేజింగ్ డైరెక్టరు, జమీందారు శ్రీ కర్లపాటి అప్పారావుగారు రు 2000 లు దాకా వెచ్చించి కాంపౌండునకంతా తీగెకంచెను అమర్చిరి.

బెంగుళూరువాసి శ్రీ బి. వి. రాజగోపాలనాయుడుగారు బిల్డింగుఫండునకన్నా అన్యమైన స్కూలుఖర్చునకై రు 1001 లు విరాళమిచ్చిరి.

పశ్చిమ గోదావరిజిల్లా దిప్పకాయలపాడువాసియైన శ్రీ వేములపల్లి సత్యనారాయణగారి తల్లి శ్రీమతి బుల్లెమ్మగారు స్కూలుకొరకు ఒక గుడ్డలుకుట్టే మిషన్, హార్మోనియం తదితరమైన సంగీతకళా యంత్రములను కొనుటకై రు 500 లు ఇచ్చినారు.

ఇట్లు,
కేసరి విద్యాసంఘ సభ్యులు.

# అమూల్య రత్నాలు : వజ్రములు :

శ్రీ వసంతరావు వెంకటరావుగారు

(గత సంచిక తరువాయి)

వజ్రాలను తూచడానికి ప్రత్యేకమైన కట్టెలున్నాయి. వాటిని 'కారెట్లు' అంటారు. పూర్వకాలంలో తూకానికి సరియైన కట్టెలులేవు. చిన్నబరువులను తూచడానికై గింజలనే కట్టెలుగా వాడేవారు. ఏదేశంలో ఏగింజలు సుమారుగా ఒకేబరువుంటే ఆ దేశంలో ఆగింజలను ఉపయోగించేవారు. యూరపుదేశంలో బార్లిగింజలు, ఇంగ్లండులో గోధుమ, వరి, మనదేశంలో గురివెంద గింజలు వాడుకలో నుండేవి. ఇప్పటికూడా, బంగారం తూచేటప్పుడు గురివెంద గింజలను కంసాలులు ఉపయోగిస్తారు. ఈసారి బంగారం తూచినప్పుడు పరీక్షగా చూడండి. ఈ పద్ధతి అంత ప్రశస్తంకాదని 'కారెటు'ను అంతర్జాతీయంగా ఒప్పుకొన్నారు. ఒక గ్రాములో ఐదవభాగం 'కారెటు' తులానికి సుమారు $11\frac{1}{2}$ గ్రాములు ; కాబట్టి తులానికి సుమారుగా 60 కారెట్లు. అంటే, అణా యెత్తులో దాదాపు 4 కారెట్లున్నాయి.

వజ్రాలను కారెట్లంత చిన్నకట్టెలతో తూచడానికి కారణమేమంటే అవి చాలా ఖరీదైనవి కాబట్టి, యుద్ధానికిముందు ఒక కారెట్టువెల 50 రూపాయలుండేది ; ఇప్పుడు కారెటు 800 రూపాయలు.

కొన్ని పెద్ద వజ్రాల బరువు చూడండి :

కులినన్ - 3106 కారెట్లు : జోంకర్ - 726 కారెట్లు.

రీజెంటు - 410 కారెట్లు : కోహినూర్ - 186 కారెట్లు.

మనదేశం నిజంగా రత్నగర్భ. దక్కను పీఠభూమికి తూర్పు ప్రాంతాలలో మొదటి వజ్రపుగనులుండేవి. కోలారు గనులలో దొరకినవే మొదటి పెద్ద వజ్రాలు; 60,000 మంది పనిచేస్తూండగా 1645-వ సంవత్సరంలో ట్రావెర్నియర్ అనుయాత్రికుడు చూచినట్లు వ్రాసేడు. ఇప్పుడు బ్రేజిల్ లోను, దక్షిణ ఆఫ్రికాలోను మంచి వజ్రపుగనులున్నాయి. దక్షిణాఫ్రికాలో ఎక్కువగా దొరుకుచున్నాయి. డీబియర్స్ అనే సంస్థ సంవత్సరానికి ఏడుకోట్ల రూపాయలు విలువగల వజ్రాలను గనులనుండి తీస్తున్నారు. ప్రపంచంలోనున్న పెద్దవజ్రసంస్థ అదే.

వజ్రాలకోసం యుద్ధాలు జరిగేయి. కొన్నికొన్ని పెద్ద వజ్రాల చరిత్ర చక్కగా ఉంటుంది.

కోహినూర్ అంటే వెలుగుకొండ అని అర్థం. కోహినూర్ వజ్రం కొండంత కాంతితో మెరిసిపోయేది. అది ఎప్పుడు దొరికిందో సరిగ్గా తెలియదు కాని, మాల్వార్ రాజులకుదక్కి 1304-వ సంవత్సరం దాకా వారివద్ద ఉండేది. తరువాత దానిని అల్లా ఉద్దీన్ తీసికొన్నాడు. కొంత కాలానికది మొగలు సామ్రాట్టులను చేరుకొంది. అక్బరు, షాజహాను, జహంగీరు దానిని ధరించేరు. పెర్షియారాజు నాదిర్ షా ఇండియాపై దండెత్తి, ఢిల్లీని ముట్టడించి, ఔరంగజేబు నెమలి సింహాసనంలోనున్న కోహినూరుని సింహాసనంతోసహా తీసికొనిపోయేడు. దానిని తిరిగి మనదేశం తీసికొనివచ్చేరు ; పంజాబులోనుంచేరు. మన

దేశాన్ని ఇంగ్లీషువారు ఆక్రమించుకొన్నప్పుడు దేశాన్ని కొల్లగొట్టి కోహినూర్‌ను తీసికొనిపోయేరు. అప్పటికి దాని బరువు 186 కారెట్లు. కాని, గనులనుండితీసిన వజ్రాలకు జిగజిగ మెరపుండదు. వాటిని జాగ్రత్తగా సానపట్టాలి. వాటి పలకలు తీర్చిదిద్దినప్పుడే వజ్రాలకు ధగధగలాడే లక్షణం అలవడుతుంది. పలకలు పాడుకాకుండాకోసి, సానపట్టడం చాల కష్టమైనపని. దానికెంతో నేర్పుండాలి. ఇంగ్లండు తీసికొనిపోయిన కోహినూర్‌ను సానపట్టగా దానిబరువు 109 కారెట్లకు తగ్గిపోయింది. ఇప్పుడది ఇంగ్లండు రాణీగారి కిరీటంలోనుంది.

'గ్రేట్ మొగల్' అనే వజ్రంకూడ గోల్కొండ గనులలోదే. దానిబరువు 737 కారెట్లు ఔరంగజేబు ఖజానాలో దానిని చూచినట్లు ట్రావెర్నియర్ వ్రాసేడు.

'రీజెంటు' లేక 'పిట్' అను వజ్రంకూడ మనదేశంలోనిదే. మద్రాసు గవర్నరుగానున్న పిట్ ఆ వజ్రాన్ని 20,400 పౌన్లకు కొన్నాడట తరువాత దానిని ఆర్లియన్స్‌డ్యూకు సుమారు 15 లక్షల రూపాయలకు ఖరీదు చేసేడు. దానిబరువు 410 కారెట్లు.

'అక్బర్‌షా' అను 116 కారట్ల వజ్రంపై ఏరబిక్ భాషలో దానిని ధరించిన వారిపేర్లు చెక్కబడి ఉన్నాయి. సానపట్టినతరువాత దానిబరువు 71 కారట్లు. దానిని బరోడా మహారాజా సుమారు 5 లక్షల రూపాయలకు కొన్నాడు.

వజ్రాలన్నిటిలో పెద్దది కులినన్ వజ్రము. దానిబరువు 3106 కారట్లని తెలిసికొన్నాం. 1905-వ సంవత్సరంలో దక్షిణాఫ్రికా గనుల మేనేజర్ అయిన ఫ్రెడరిక్ వెల్స్ గనులలో పచారుచేస్తూ ఒకగోతిలో మెరుస్తూన్న వజ్రాన్నిచూసేడు. చాలపెద్దదావజ్రం. అంతవజ్రముంటుందా అని అనుమానించి, ఎందుకైనా మంచిదని దానినితీసి, జేబులోపెట్టి, ఆఫీసుకిపోయి, పరీక్షించిచూసేక వజ్రమేఅని నమ్మకంకలిగింది. వెంటనే, ప్రీమియర్ డైమండ్ మైన్ అధ్యక్షుడైన తామస్ కులినన్‌వద్దకుపోయి దానిని సమర్పించేడు. దానిబరువు సుమారు 54 తులాలుండడంచూచిన కులినన్ ఆశ్చర్యపోయి, వెల్స్‌కి పదివేలడాలర్ల చెక్కు బహుమతిగా ఇచ్చేడు. ట్రాన్‌స్వాల్ ప్రభుత్వం దానినికొని, ఆంగ్లేయరాజు ఎడ్వర్డుకి, ఆయన 66 వ పుట్టినదినంనాడు, 1907 లో సమర్పించేరు. దానివిలువ సుమారు ఒకకోటి ఇరవైలక్షల రూపాయ లుంటుంది. తరువాత, దానిని 9 పెద్దముక్కలుగా కోసేరు.

జోంకర్ వజ్రంగురించికూడ మంచికథఉంది. గనలలో పనిచేస్తూ ఏడుగురు పిల్లలతో తిండిలేక బాధపడుతూన్న ఖాకొబస్ జోంకర్ అను జనుడు, 16 ఏండ్లక్రిందట, విచారగ్రస్తుడైయుండగా కోడిగ్రుడ్డంత రాతినొకదానిని పనివాడుతెచ్చి యిచ్చేడు. అదిచూచి జోంకర్ నిర్ఘాంతపోయేడు. కాని, జోంకర్ భార్య ఆ వజ్రాన్ని ఒకమేజోడులోపెట్టి, దానిని మెడకుకట్టుకొని, రాత్రిఅంతా ఇంటిచుట్టూ తుపాకులతో జనాన్ని కాపుంచింది. మరునాడుదయమే దానిని డైమండు కార్పొరేషన్‌లో పెట్టగా, జోంకర్‌కి 17½ లక్షలరూపాయలకొక చెక్కువచ్చింది.

వజ్రాలలో రంగువికూడఉన్నాయి. 'బ్లూబ్రిల్లియంట్' అనునదొకటి, 'డ్రెస్‌డెన్‌గ్రీన్' అను లేత ఆకుపచ్చరంగు దొకటి; పసుపుపచ్చని 'ఫ్లోరెంటైన్' అనునది మరొకటి. పగులువేసిన వజ్రాలను, ఆభరణాలకు వాడక, వాటిని ముక్కలుచేసి పరిశ్రమలలో వినియోగిస్తారు.

# సంతబజారు

శ్రీమతి గుడ్లదొన రాఘవమ్మ గారు

ఇదుగో
ఇదిమా
సంతబజారు !
వరులందరు
ఇచ్చటనే
వేలానికి
తయారు.
ఇదిమాకొక
వ్యాపారం.
ఇది మా నిత్యపు
సంసారం.
వ్యాపారంలో
మర్మాలన్నీ
విప్పి చెప్పగా
వీలేలేదు.
ఇదుగో
ఇదిమా
సంతబజారు !





అదుగో
అతడొక బి. ఎ.
రేటంటే
ఎంతో లేదు.
అయిదు వేలతో
అన్నీ సరియే.
ఆడపడుచు
లాంఛన మొక్కటె
అన్నిటిపై ఎక్స్ట్రా.



నంబరు టు.
ఇంటర్ వాడు
ఆస్తీ పాస్తీ
చాలా ఉంది.
చదివేవరకు
చదువంతా
తమ దేభారం ;
యం. బి. బి. యస్
డాక్టరుగా
చూడాలట
వాండ్లమ్మ.



ఇదిగో
ఇతడొక
మెట్రిక్యులేషన్
మెంబరుగారు.

ధరయేమీ
ఎక్కువ లేదు -
ముచ్చటగా
మూడే వేలు
కంచంగిన్నె
కావాలండీ ;
తోడికోడలుకు
తొమ్మిదికాసులు
వరకట్నం
ఈవాలండి.
మిగిలినవన్నీ
గొప్ప గొప్పవే.
తమరాపై
భరించలేరు.
ఇదుగో
ఇదిమా
సంతబజారు !
ఆ-మరిచా
నితని సంగతీ ;

అదుగో
అతడొక
సంస్కారి.
కట్నము
లొద్దని
చదివేటప్పుడు
లెక్చరులెన్నో
చక్క చక్కగా
దంచేశాడు.

కట్నము లేనిది
గౌరవహీనము.
అమ్మా అక్కా
ఆత్మహత్యకే
తలపడ్డారట.
నిన్నప్రొద్దుటే
సంతలిస్టులో
ఆయన పేరును
చేర్పించేశాం.



ఇదిమా
సంతబజారు !
కట్నాలకు
కారణభూతులు
కాపురాలు
చేసే రమణులై.
భారత నారిమె
నడుముబిగించిన
సంతబజారులు
చదరముగావా ?
వరకట్నాలకు
ఆహుతి యవ్వ
కాపురాలు
నిలుచునుగాదా ?

దుర్భరమై
దుష్కరమై
దుస్సహమై
చెలరేగడియా
వరకట్నాల
పిశాచిని
ద్రోలుట
భారతతరుణీ
బలగంబులకే
విధ్యుక్తంబౌ
కార్యంబేగా
ఇదిమా
సంతబజారు.!

# పెళ్లికొడుకుల వేలంపాట

—(:o:)—

అమెరికాలో 'ఫ్లారిడా' అనేచోట మియామీ బీచ్ అని సుందరమైన ప్రదేశం. అక్కడ దేశదేశాలనుంచివచ్చి యాత్రికులు సమావేశమవుతుంటారు. అక్కడ ఒక చిన్న సంస్థ ఏర్పడినది. అది కొని అందమైన పెళ్లికొడుకులను వేలం చేయుదురు. ఈ వేలం



పాట ఈ నెలలోనో వచ్చేనెలలోనో జరుగుతుందట. యాత్రకువచ్చిన ధనవంతురాండ్రలో ఎవరు ఎవరిని హెచ్చుపాట పెట్టికొంటే వారిని అతడు పెళ్లి చేసుకోవాలి. అవసరమైతే విడాకులుపుచ్చుకోను సంఘంవారా చిన్నవారికి సహాయం చేస్తారుట.

ఈ సంస్థను బనాయిస్తున్న ముఖ్యులలో నొక్కరైన స్టాక్ ఫోర్బర్ 25 సం॥ యువకుడు. "మా సంస్థ ఇంకా ప్రారంభదశలోనే ఉన్నది. బాగాపనిచేస్తే ఇది ఒక జాతీయ సంస్థయేగాదు; అంతర్జాతీయ సంస్థ అవుతుంది" అని అంటాడు. మియామీ హెరాల్డ్ అనే పత్రికలో ఈవిషయమై ప్రకటనగూడా పడిందట!

---

# త్యాగమూర్తి



శ్రీమతి ఆర్. యస్. అన్నపూర్ణాదేవిగారు

(గత సంచిక తరువాయి)

శోభా - ఎంత దయాశూన్యమో నీ గుండెకదా! నీకై, పలుశ్రమలకోర్చినది తెలియదా? రక్త మోడ్చిన యన్న ధనము నీకొసగలేదా - యింకను, యీసాధనలేనా?

'శశీ! నీవు హృదయశూన్యుడవోయీ - నీకు ప్రేమతెలుసునా? లేకున్న, నిన్నంతగా ప్రేమించిన గీత నధోగతిచేతువా? కన్నతండ్రికి మారుగా చూచుయన్నకు, యిన్ని యిక్కట్లుకల్గింతువా? నీవొక కాముకుడవు - నీకు ప్రేమకూడనా?' శశి గుండెలు జారిపోయినవి. ఎంత లేనిమాటలు, శోభ పల్కులేనా, శశీ, నిన్నువిడచి మనలేదన్న - నీప్రణయ రసాధిదేవినన్న, శోభయేనా? ఎంతనిర్దయ?

'శోభా - నీవేమన్నసరియే - కానీ - నాకు నీ ప్రేమభిక్షమాత్రము మరవకు, నీ ప్రేమలేకున్న, నాబ్రతుకు గడువదు - నీ పాదములాన' యని - శశి శోభకాళ్లపైవ్రాలినాడు.

'శశీ, ప్రేమవీరుడవోయీ, నీ త్యాగమాచంద్ర. తారార్కమై వెలయగలదు!' యన్న పల్కులు వినిపించినవి. శశి, శోభ లదరిపడినారు, శశి - తన కన్నులను నమ్మలేకపోయినాడు. ఆ యాగంతకుడు - తనకై రక్తమును ధారవోయుచున్న, సహోదరుడు రఘు !!! రఘు - ఎలా యిచటికి రాకల్గినాడు, తాను శోభ, శోభపదములనుండి లేచినాడు. రఘు సమీపించి 'శశీ, తండ్రియాశయము లతిచక్కగా నిర్వర్తించి నావు నాయనా? ప్రణయరసాధిదేవినుండి ప్రణయభిక్షకోరి ధన్యుడవైనావు. ఇట్టి సన్నివేశము నన్ను చాల యానందమున ముంచినది - ధన్యమైనది - నాజన్మ' యన్నాడు. శశి హృదయములో, అవమానము, చింత, ప్రజ్వలించినవి, శోభ కాళ్లపైతాను - యిట్టిస్థితిలో, శోభ తెలిసికొన్నది - అతనే 'శశి' యన్న యని- యిక పీడతొలగినట్లే!

'శశి యన్నగారు తమరేనా? చాల ఘనుడగు తమ్ముని యన్నగారే' యన్నది.

శశి కిది పిడుగువలె తోచినది. తన్నుకాక - తన యన్ననుకూడ, పరిహసింప బూనుకొన్నదా - క్రోధముతో కన్నులు - ప్రజ్వలించినవి; 'శోభా - ఆగు - యింకొకమాట - నీప్రాణమునకే ముప్పు' యని గర్జించినాడు. శశిలోని యాత్మగౌరవము పొంగినది. శోభ కిది పరిహాస మనిపించినది.

'శశీ, ఈ టియాకు చప్పుళ్లకు, కుందేళ్లు బెదరవు-పాపము-అన్నపైన-అభిమానమేనా, నీవు-మానవ రూపమునున్న రాక్షసుడవు - ఘోరపాతకివి - నీచుడవు - నీవా, నాకు హితము నేర్పునది; యనుచునే 'హా' యని నేలకొరగి - రక్తపుగుంటలో వ్రాలినది. నేలయంతయు రక్తసిక్తమైనది - గుండెలో బాకు గ్రుచ్చుకొనుటచే యామె క్రిందపడి - మరణించినది. నీచురాలి జీవితమునకంత మదియేనేమొ!

అతివిచిత్రముగ, తను మునుపే, శోభ తిరస్కరించిన, ఆత్మహత్య చేసికొనతలచి తెచ్చిన బాకు తన చెంతనుండినది. కోపమున కన్నులగుపించలేదు. కులట, తన్ను నాశనమొనరించినదే కాక, తన్ను నిందించినదే కాక, దేవతాస్వరూపుడగు, అన్నను నిందించుట సహింపలేకపోయినాడు. తత్ఫలితము - తనబాకు శోభ కీప్రపంచమునుండి విముక్తి ప్రసాదించినది. రఘు విభ్రాంతుడైనాడు. క్షణములో జరిగిన దీ

సంఘటన - ఘోరము. తన ఎదురుగ, ఘోరహత్య - ఇక తరుణోపాయము. శోభ - అరవుతో సేవకులు వచ్చి - యీ దృశ్యమును చూచి, రక్షకశాఖకు తెలిపినారు. రఘు, శశి ఇరువురు - నిశ్చేష్టితులై నిలచియుండినారు. రక్షక భటాధికారిరాగనే, రఘు - ముందుకువచ్చి తనే ఆ హత్యచేసినానని, తనకు దండనవిధించవలయునని, చేతులనందించినాడు. శశికి, కన్నులు తిరిగిపోయినవి. మాట పెగులలేదు. రఘుచేతికి సంకెళ్లు తగిలింపుచుండగా, తానే, దోషినని రఘు నిర్దోషియని అరచినాడు. అతని పల్కులు వినువారేరీ? రఘుకు బేడీలు - చెరసాలప్రాప్తి. శశిమాట విన్నవారేరి?

శశి యీలోకమునకు వచ్చినాడు. ఏమిటిది తను చేసినదేమిటి? తత్ఫలితము - ఆచరణతనది - అనుభవము - అన్నదా? ఇది - జరుగదు. న్యాయస్థానము - తాను - న్యాయముగ తననేరమును చెప్పిన, అన్నకు విముక్తికల్గకలదు! అతనిపేరు - తను - పల్కుటకునకే అనర్హుడు. తంపంటి, నీచుని నరకవలసినది - ఇదేమి? అట్టి యకార్యమును - తానాచరించినా నన్నదెందుకు - న్యాయపరిపాలనలో - శిక్షయైన - ఘోరము - తనవలన పడరాని - యిడుములు; తుదకు ప్రాణముకూడ, బలిదానమా? అట్లెన్నటికి జరుగదు. తను బ్రహ్మచారి - గీత! తన రఘు భార్య - పిల్లలు. వారందరిగతి - ఏమికావలె? ఎంతదారుణపరిస్థితి - తననేరము - చెప్పవలె - రఘును రక్షించవలె లేకున్న - రఘును తలచిన - తనకు పిచ్చికల్గినది; రఘును చూడటానికి - అనుమతి దొరకినది. వెళ్లి కాళ్లపైబడి భోరునఏడ్చినాడు. రఘు చెప్పినదొక్కటే "శశీ, గీతను పరిణయమాడి, వదినెను, పిల్లల కాపాడుదునని వాగ్దానము చేయుమన్నాడు. ఏమిటీ వింతకోరిక! తనకోరిక! తనకోరిక - అంతిమకోరిక తీర్చడం - శశి విధి - శశి ఏమో చెప్పతలచినాడు - కాలవ్యవధి మీరినందున వచ్చివేసినాడు!

గీత, మూర్తి, లలితపిల్లలు - కలకత్తావచ్చినారు. ఈ విషాదసంఘటన వారిని పిచ్చివారిగాచేసినది. న్యాయవిచారణజరిగినది. తీర్మానమే మిగులు. శశికి - గీతను పరిణయమాడు బాధ్యత, పిల్లలు, వదినె పోషణ అట్టి శోకసాగరమున - పరిణయమా?

◆ ◆ ◆ ◆

న్యాయాధీశుని తీర్మానము - రఘు దోషియని - తత్ఫలితము - ఉరిశిక్ష. శశి, కుటుంబము సంగతి చెప్ప వీలులేదు రఘు, గీతా, శశిచేతుల కలపినాడు, లలిత పిల్లల నప్పగించి, తనజన్మ ధన్యమైనదన్నాడు. తనతండ్రికోరిక - నీడేర్చినాడు. తనశశిని, కాపాడినాడు - తనప్రాణమా - పోయిన చింతలేదు! శశియుండ, లలిత, పిల్లలకు కొదువఏది? దోషి యురికంబమున, యంతిమ సందేశమదియే.

శశీ, గీతలయానందమే తన పరమావధి!

శశీ, గీత, దుఃఖమెందుకు? మీ యిరువురి దాంపత్య శోభచూచి యానందించెడి - భాగ్యము నోచుకోలేదు. ఇది చింతకు సమయముకాదు. నాతండ్రికోర్కె నెరవేర్చి ధన్యుడనైనాను - సెలవు -

రఘు — న్యాయమునకు — బలియైనాడు! నిర్దోషికి శిక్ష దోషికి విడుదల యిది సంఘపు తీర్మానము. న్యాయదేవత — అంధురాలు — కాకున్న — రఘు — న్యాయదేవతకు - బలియగునా? అంధప్రపంచము. అజ్ఞానతీర్మానములు. అన్యాయవైఖరులు.

రఘూ - ఎక్కడి రఘు? తమ్మునికై - రక్తమోడ్చి - తుదకు - ప్రాణమునేయర్పించిన, నీబ్రతుకు ధన్యము! భరతమాత సుపుత్రులలో నొక్కమణివంటి నీవు - త్యాగమూర్తి వనుటలో సందేహమా? త్యాగమూర్తీ - నీకిదే జోహారులు!!!

సమాప్తము.

# దక్షిణామూర్తి ప్రాదుర్భావము

## రమణాశ్రమ లేఖలు

(5)

భగవాన్ దక్షిణామూర్తి స్తోత్రానికి అనువాదంగా అరవంలో పద్యాలూ వాటి తాత్పర్యం వ్రాస్తూ దక్షిణామూర్తివారి అవతారకారణమగు మూలకథను సంగ్రహించి, అవతారికలో వ్రాశారు. అదేగాక ఆ స్తోత్రంలోని తొమ్మిది శ్లోకాలను లోకము, చూచేవాడు, చూపించేప్రకాశము అను మూడు తరగతులుగ విభజించారు. అది ఎట్లాగంటె, (1)- విశ్వందర్పణ, (2)- బీజస్యాంతరివ, 3)- యస్యైవస్ఫురణం, అన్న మొదటి మూడుశ్లోకాలు జగత్సృష్టిని తెలియజేస్తవనీ (4)- నానాఛిద్ర (5)- రాహుగ్రస్త, (6)- దేహం ప్రాణం అనేమూడూ చూచేవాడిని గురించినవనీ, (7) బాల్యాదిష్వపి, (8) విశ్వంపశ్యతి, (9) భూరంభాంసి అను మూడూ చూపించే ప్రకాశాన్నిగురించి చెప్పారనీ, 'సర్వాత్మత్వం,' అనే కడపటిశ్లోకం అంతయు తన్మయమేనన్న అర్థమిచ్చుననీ తాత్పర్యం.

ఆమధ్యనేనా అవతారికకు తెలుఁగు అనువాదం వ్రాశాను. భగవానదిచూచి చిరునవ్వుతో "ఇదిగో. నేనీస్తోత్రానికి సంబంధించినంతవరకే కథ సంగ్రహించి వ్రాశాగాని అసలు కథ చిత్రంగావున్నది. ఏమంటే, బ్రహ్మజగత్సృష్ట్యాదిలో తన మానసపుత్రులగు సనకసనందనాదులను చూచి సృష్టిక్రమంలో నియోగిస్తే వారు దానియందు విరక్తులై నిరాకరించి సుర, మునిగణ పరివృతులై నందనవనమందుండి జ్ఞానోపదేశం చేసే వారెవరని యోచిస్తుంటే నారదుడువచ్చి 'బ్రహ్మకన్న బ్రహ్మోపదేశకర్త లెవరున్నారు? పోదాం బయలుదేరండన్నాడు. 'సరేమంచి' దని దేవతాసమూహంతోకదలి సత్యలోకానికి వచ్చారంతాను. బ్రహ్మకెదురుగా సమీపంలోకూర్చుని వాణి వీణవాయిస్తూ పాడుతున్నది, 'ఆహాహా' అంటూ ఆనందంతో తాళంవేస్తున్నాడు బహ్మ. 'ఆడదానిపాటకామోదించే అయ్యగారు అధ్యాత్మతత్త్వం ఏంబోధిస్తా'దని వారంతా యోచిస్తుంటే 'పదండి వైకుంఠాని' కన్నాడు నారదుడు. వారదేమని యోచింపక వైకుంఠానికి నడిచారు.

లోపలి సౌధంలో వున్నాడా ప్రభువు. చొరవగలవాడుగదా నారదుడు. 'చూచివస్తానుండం'డని చొచ్చుకొని లోపలకు వెళ్ళాడు. రవంతలో తిరిగివస్తే 'ఏమయ్యా' అన్నారువీరు. 'అక్కడ అమ్మగారు తాకకుండా కూర్చుని పాడుతూవుంటే ఇక్కడ పక్కలోనే కూర్చుని పాదాలొత్తుతున్నది. ఇది మరీ అన్యాయం. కాంతాకటాక్షపాశాల్లో కట్టుబడ్డ ఈ సంసారిమాత్రం మనకేం సహాయం చేస్తాడు? ఈ పట్నం, ఈ వైభవం చూడండి ఎట్లాగున్నవో. చాలునిక శంకరు నాశ్రయింతాం రం" డన్నాడు నారదుడు.

అంతా హిమాచలాభిముఖులై నడిచారు. కైలాసపర్వతం చూచి గంపంత ఆశతో అంతా ఎక్కారు. నిండుసభలో శంకరుడు అర్ధనారీశ్వరుడై తాండవనృత్యం చేస్తున్నాడక్కడ. విష్ణువు డుబుకు డుబుకంటూ డోలువాయిస్తుంటే బ్రహ్మతాళం వేస్తున్నాడు, వీరదిచూచి 'అవ్వ' అని నోరుమూసుకొని 'ఓహో, ఇతడూ స్త్రీలోలుడే. బ్రహ్మ స్త్రీని తాకకుండా వుంటే విష్ణువు తాకుతూ వున్నాడు. ఈయన శరీరంలోనే ఇముడ్చుకున్నాడే. ఇంకా ఘోరం. చాలు చాల'ని చక్కాపోయారు. శంకరుడది గ్రహించి 'అయ్యో, స్త్రీలతో కలసి వున్నంతనే జ్ఞానరహితులని తలచి ముముక్షువులను తిరస్కరించారే, ఏమి భ్రమ. తీవ్రజిజ్ఞాస పరులైన వీరలకిక బోధించేవారేవరు?' అని చింతించి, తపస్సనే నెపముతో పార్వతిని

పంపి దయామయుడైన శంకరుడు ఆ సనకసనందాదులు పోయే మార్గమధ్యమందు మానససరోవరోత్తర భాగంలో ఉన్నవట వృక్షం క్రింద దక్షిణామూర్తిగా యువకుడై చిన్ముద్రతో దక్షిణాభిముఖంగా కూర్చున్నాడు. ఈకథ దేన్లోనో చదివాను" అన్నారు భగవాన్.

ఈకథ ఎంతచిత్రంగా వున్నది? భగవాన్ ఇదంతా ఎందుకు వ్రాయలేదు? అన్నాను. "ఏమో, వారి ఆవిషయమంతా మనమేల వ్రాయుటని వదలివేసి, అష్టకానికి కావలసినంతే తీసుకున్నా" నన్నారు భగవాన్. ఇటీవల విచారిస్తే పైకథ శివరహస్యం దశమాంకంద్వితీయాధ్యాయంలో 'దక్షిణామూర్తి ప్రాదుర్భావం' అన్న శీర్షికతో ఉన్నదని తేలింది. అదివిని "దక్షిణామూర్తి ప్రాదుర్భావమంటే వారి పుట్టుకా?" అన్నారొక భక్తులు. "ఊఁ, వారికి పుట్టుకయేమి? శివుని పంచమూర్తులలో అదొకటి. మౌనముద్రతో దక్షిణాభిముఖంగా కూర్చున్నారన్నమాట. అంతరార్థం అమూర్తినే సూచిస్తుంది. దక్షిణామూర్తి అష్టకంలో మూర్తినా వర్ణించింది. అంతా అమూర్తినేగదా? శ్రీదక్షిణామూర్తి శ్రీ అంటే మాయాశక్తి, దక్షిణ అంటే సమర్థుడైన అని ఒక అర్థం, దక్షిణభాగమైన హృదయమందని ఒక అర్థం, అమూర్తి అంటే మూర్తిలేనివాడు. దీనికిపెద్ద వ్యాఖ్యానమే వున్నదే?" అన్నారు భగవాన్.

"సనకాదులు ఎప్పుడూ అయిదేండ్లవయస్సు బాలురవలనే ఉంటారని భాగవతంలో చెప్పారే ఈస్తోత్రంలో 'వృద్ధాః శిష్యాః గురుర్యువా' అన్నారెందువల్ల?" అన్నారొభక్తులు. "జ్ఞానులు" సదా బాలకులవలెనే వుంటారు. వారిపుట్టుకకు యౌవన జరాదులుండవు. 'వృద్ధాః శిష్యాః' అంటే సనకాదులు అజ్ఞానపుట్టుక గనకపూర్వంవృద్ధులన్నమాట. ఆపుట్టుక గననివారందరూ వృద్ధులే. ఆపుట్టుక గన్నవెనుక సదా బాల్యమే" నన్నారు భగవాన్. భగవాన్ వ్రాసిన అవతారికకు నేనువ్రాసిన అనువాదం దిగువన వ్రాస్తున్నాను.

" అవతారిక "

"జగత్సృష్టి కర్తయైన బ్రహ్మమానస పుత్రులగు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులన బడు నలువురును జగత్సృష్ట్యాది కార్యములకై, తాము సృజింపబడినది తండ్రి వలన విని, దానియందు విరక్తిగలవారై ఉపశాంతి నపేక్షించి అది తెలుపగలవారిని వెదకుచుఁబోవగా, ఆ తీవ్రజిజ్ఞాసువులందు పరమ కారుణ్యముగల్గి సాక్షాత్ పరమేశ్వరుఁడు దక్షిణా మూర్తిగా మౌనమైన స్వస్థితిలో వటవృక్షముక్రింద చిన్ముద్రాంకితుడై యుండుటగాంచి, వారు అయస్కాంత సమీపమున ఇనుమువలె నాకర్షింపబడి, వారి సన్నిధి నటులనే స్వస్వరూపమున నెలకొనిరి.

ఆ మౌనమైన స్వస్థితియొక్క యాదార్థ్యమును గుర్తింపజాలని ఉత్తమాధికారులకు నద్దుఁగాదోచు లోకమును, చూచువాడును, చూపించు ప్రకాశమును అయి విజృంభించి లయించుశక్తి తనకన్న భిన్నము కానందున 'అంతయు తన్మయమే' అను సర్వాత్మత్వమును ఈ స్తోత్రమునందు ఆచార్య శంకరులు తెలిపినారు.

శ్రీరమణాశ్రమం ఇట్లు

7—2—47 సోదరి.

# ప్రబోధము

మాలతీ! దివ్యసౌరభోన్మాదవౌచు మలయునప్పుడె సిగలపై వెలుగుచుందు
తెల్లవారిననేమహో? తెలియరావు సతముగాబోదు గౌరవస్థానమెపుడు.

కన్నులకు గోరగించెడి వన్నెగలిగి మనసురంజిలునట్టి వాసనలుగలిగి
వెలయుదు నటంచు గర్వింపవలదు కమల యినుని బాసిన నీ చెల్వమేమియౌను.

కనకమ నీరూపమునకు ననువుగ వాసనయుగల్గెనని గర్వోన్మా
దినివౌచు విఱ్ఱవీగకు నిను మధుపము వెలియొనర్చె నీకులమందున్.

ఎచట బుట్టిననేమి నాయందు మేల్మి కాంతి సుగుణంబుగలదంచు గర్వపడకు
హరుని బూజింప కేతకీ యర్హమగుదే జన్మమెత్తిన వలవదే సార్థకంబు.

పూచినప్పుడు సిగపైన బొదలునప్పుడు వాడి వత్తలుగా నేలబడినయప్పుడు
రంజిలుదు వొక్కటే మనోరంజనంబ ఘనులలో మార్పు లేప్రొద్దుగలుగ వార.

కలకలమని సులలితముగ పలువిధరాగముల తాళభరితంబులుగా
పలుకుదునని మదినుబ్బకు మలపకునే: దంత్రులెడల నావల వీణా?

గురితప్పక పటుశరముల బరపించెదననుచు గర్వపడెదవు విల్లా:
ఇరవగునల్లెయె దెగినన్ గొరయేదే! యొక్క గొఱ్ఱకొదుమన్ దోలన్.

ఏరికైనను హృదయంబు గోరగించు పదవియో! ఖ్యాతియో! గౌరవంబో జగతి
గలుగవలెనన్న సాయంబునలయుగాని తనకు దా తెచ్చికొన బ్రహ్మతరముగాదు.

గంటి కృష్ణవేణమ్మ.





## వంకాయ ఆవకాయ

వంకాయలు 1 శేరు, చింతపండు $\frac{3}{8}$ శేరు (మూడు అర్ధపావులు), మిరపపళ్లు $\frac{1}{4}$ శేరు, ఉప్పు మూడర్ధపావులు, మంచినూనె $\frac{1}{2}$ శేరు, పసుపుపొడి కొంచెము. చేయు విధానము: వంకాయలు శుభ్రముగా కడిగి తుడిచి తునకలుగా కోసియుంచవలెను. చింతపండు శుభ్రపరచి మిరపపళ్లు, ఉప్పు, వంకాయలు ఇవన్నియు వేరు వేరుగా దంపవలెను. దంపిన ఆవస్తువులు, పసుపుగూడ వేసికలిపి ఒకజాడీలోవేసి యుంచవలెను, వారముదినములైనతరువాత, $\frac{1}{2}$ శేరు నూనెలో, ఎండుమిరపకాయ ముక్కలు, ఆవాలు, మెంతులు కొంచెము ఇంగువవేసి వేపు దోరగా వేగనిచ్చి చల్లారిన తరువాత జాడీలోనున్న ఆవకాయలో కలిపి, జాడీలో నుంచవలెను.

## ఉసిరికాయ పచ్చడి

1 కుంచెడు ఉసిరికాయలను దంపి పిక్కలు వేరుచేయవలెను. తరువాత దానియొక్క రసమును, కొద్దిగా పిండివేయవలెను. పిండినపొట్టులో, $\frac{1}{4}$ శేరు చింతపండు, $\frac{1}{4}$ శేరు మిరపపొడి, $\frac{1}{4}$ శేరు ఉప్పు, పసుపుపొడి కొంచెమువేసి కలిపి ఒక జాడీలో యుంచవలెను.

3 దినములైన తరువాత $\frac{1}{4}$ శేరు మంచినూనెలో కొద్దిగా, చేరడు శనగపప్పు, మినపపప్పు, ఎండు మిరప తునకలు, ఆవాలు, మెంతులు 2 టీ చెంచాలు, పొడిచేసి, ఇంగువ ఇవన్నియు వేసి పోపువేయవలెను. పోపు వేగనిచ్చి నూనె చల్లార్చి అందులో కలుపవలెను. ఇది, 3 సం|| ల వరకు నిలువ యుండును. ఇది వంటికి ఆరోగ్యమును నోటికి రుచియు, నిచ్చును.

కామాడ దేవకీదేవి.

## మైదాపిండి హల్వా

2 ఆళాకుల మైదాపిండిలో, 2 ఆళాకులు మంచిఆవుపాలుపోసి వుంటలు కాకుండా, దోసెపిండిలాగు కలిపి తీసివుంచ వలెను. ఆ తరువాత, 2 ఆళాకులు బూరాచక్కెర, లేక పిండిచేసుకొన్న పంచదార, చిటికెడు కుంకుమపువ్వు (కేసరి), 5 తులములు నెయ్యి, తగినంత ఏలకుపొడి, 1 తులం జీడిపప్పు, 1 తులం చారపప్పు, 1 తులం ద్రాక్ష, తీసివుంచుకోవలెను. తగినంత కంచుపాత్రలో 2 ఆళాకులు నీళ్ళుపోసి బాగా కాగిన తర్వాత కలిపివుంచుకొన్న మైదాపిండినిపోసి బాగా గరిటతో కలుపుచుండవలెను. కొంతసేపు

వుడికిన తర్వాత వుంచుకొన్న నెయ్యి, జీడిపప్పు, చారపప్పు, ద్రాక్ష, ఏలకుపొడి, కేసరి లేక కుంకుమ పువ్వు వగైరాలనువేసి బాగా కలుపుచుండవలెను. పాకము గట్టిఅయిన తర్వాత, పళ్ళెమునకు నేయి రాచి దానిలోపోసి కొంత ఆరినతర్వాత ముక్కలుకోసి తీసి వుపయోగించవలెను. ఇది చాలా రుచికరముగా నుండును.

## మసాల ఇడ్డిన

2 అరసోలలు బియ్యం నీళ్ళలో పోసి శుభ్రముగా కడిగి ఎండలో ఆరపోయవలెను. ఎండిన తరువాత, రవలాగు నూకచేసుకొని, 1 అరసోల వుద్దిపప్పు నీళ్ళలోపోసి, బాగానాననిచ్చి రాళ్ళులేక శుభ్రపరచి మెత్తగా రుబ్బి తయారుచేసిన నూకయందులోవేసి కలిపి, పిడికెడు సెనగపప్పు వేసి యుంచవలెను. రెండవరోజు, పచ్చి అనపకాయగింజలు లేతవి 1 అరసోల, పచ్చికొబ్బరి 1 టి, పచ్చిమిరపకాయలు 7, 8, కొంచము కొత్తిమెరి, కాస్తకరివేపాకు సన్నగా ముక్కలుచేసి కలిపివుంచిన పిండిలో వేయవలెను. ఇడ్డిన లేక కుడుములుపోయు పాత్రలో పోసి చక్కగా వుడికించి తీసి వుపయోగించవలెను. ఇవి చాల రుచికరముగా వుండును. ఖర్చుతక్కువ.

## పాలు, బియ్యం పాయసం

మంచిపాలు 1 పడి, తెల్లని బియ్యం ½ అరసోల, పచ్చికొబ్బరికాయ 1 తీసి కొబ్బరితురుము కోరి వుంచుకోవలెను. పెద్దపాత్రలో పాలుపోసి మసల కాచుకోవలెను. ఆ తర్వాత కొలచివుంచిన బియ్యమును, నీళ్ళయందు బాగా కడిగి శుభ్రమైన పిదప మసలుతుండే పాలలోవేయవలెను. బాగుగా వుడికిన తర్వాత 1 అరసోల (5 తులములు) పంచదార, 5 తులములు జీడిపప్పు, 3 తులములు ద్రాక్ష, కుంకుమపువ్వు (కేసరి), ½ చంచా ఏలకుపొడి, తురిమివుంచుకున్న కొబ్బరను పాలుపిండి తీసి వుడుకుచున్న పాలబియ్యములోవేసి గరిటతో బాగా సువాసన వచ్చువరకు, కలుపుచుండవలెను. గట్టి అయిన తర్వాత తీసి వుపయోగించ వలెను. ఇవి దేహమునకు చాలా పుష్టికరము.

## మసాల ఓంపొడి

పచ్చిసెనగపిండి 2 అరసోలలు, పచ్చిబియ్యం పిండి 1 పిడికెడు, తీసివుంచుకోవలెను. ½ తులం వుల్లిపాయలు, ½ చంచా ఓమం, ఎండుమిరపకాయలు 2, కొత్తమరి 4 పోసలు, కాస్తకరివేపాకు లేతది, ఇవి చక్కగా మెత్తపడునట్లు నూరి వుంచుకోవలెను. ఆ తర్వాత, కొలచి వుంచుకొన్న పిండివగైరాను, చాలినంత పాత్రలో వేసి ½ చంచా పసుపుపొడి, తగినంత పొడిచేసినవుప్పు, వేసి, నీళ్ళుపోసి గట్టిగా కలిపి వుంచుకోవలెను. ఆ వెనుక బాణలిలో నెయ్యి, లేక నూనె, పోసి బాగా కాగిన తర్వాత కలుపుకొన్న పిండి ముద్దను, ఓంపొడి పీటలోవేసి పిండి, ఎఱ్ఱగా కాలిన తర్వాత తీసి వుపయోగించ వలెను. ఇవి చాలా బాగుండును.

ఎల్. ఎస్. సుశీలాదేవి.

---o---

# బ్రతుకు తెరువు

ఏబులం నూనెకు 50 ముద్దమందారపూవులు వేసి నూనె ఎంతఅయితే నీరు అంతపోసి నూనె మిగులునట్లుగా కాచి వడగట్టి తలకు రాచుకొనిన వెంట్రుకలు వృద్ధి పొందును; లేదా గుంటగలరాకు పసరు మంచినూనె సమభాగములుగా కలిపి నూనె మిగులునట్లుల కాచి వాడుకొనవచ్చును. మంచిపత్రి ఆకురసం, కొబ్బరినూనె, గుంటగలరాకు పసరుపోసి కాచి వాడుకొనవచ్చును. మంచిపత్రిఆకు మెదడుకు చలువచేయును. గోరింటాకుగాని రేగి ఆకుగాని మెంతి ఆకుగాని నూరి తలకుపట్టించి, కొంతసేపు ఇనికిన తరువాత రాత్రి శీకాయ, కొద్దిమెంతులు నానవేసి ఉదయం ఉడకబెట్టి తలరుద్దుకొనవలెను.

కాటుక చేయుట

గాలిరానిగదిలో పేడముద్దపై ఆముదపు ప్రమిద పెట్టవలెను. దానిమీద యిటుకలపొయ్యి అమర్చి ఆముదం దీపము వెలిగించవలెను. శుభ్రముగాతోమిన, ఒక పళ్ళెమునకు అడుగున గుంటగలరాకు పసరురాసి పళ్ళెములో నీరుపోసి పొయ్యిమీద పెట్టవలెను. కాటిక బాగా పారినతరువాత తాటాకుతో కాగితంలోకి ఊడ్చి తీసుకొనవలెను. లేదా కరక్కాయ పసుపుకొమ్ము అరగదీసి పళ్లెమునకురాచి కాటిక వేసుకొనవచ్చును. ఎక్కువగా అరగదీయరాదు. పల్చగా రాయవలెను. కరక్కాయ పసుపుకొమ్ము అరగదీసిరాసిన యెడల కండ్లదురదలు మంటలు తగ్గును. కరక్కాయ అరగదీసి కాలికిరాసిన యెడల కాళ్లు పాచి పట్టుట తగ్గి కాళ్లు శుభ్రముగా నుండును. లేదా పసుపు, నూనె రాసినను తగ్గును. గుంటగలరాకుకూడ ఓషధి. గుంటగలరాకు పసరుతో వేసిన దుర్మాంసముల కోయును. గుంటగలరాకు చిగుళ్లు, ౨ మిరియాలు, ఒక ఉప్పురాయివేసి నూరి మాత్రచేసి వేసుకొనిన యెడల ఆకలిపుట్టి పురాణ జ్వరముల హరించును. కాకరాకుపసరుతో చేసిన కాటికకన్న ఈవిధముగా చేసినది మంచిది. కాకరాకు పసరుతో వేసిన దృష్టికళ్ళగునని పెద్దలందురు.

పెద్దలమాట చద్దిమూట అని పెద్దవాళ్ళమాట కొట్టివేసేందుకు వీలుకాదు. గ్రహాణం పట్టినప్పుడు గర్భిణీస్త్రీలు పని చేయకూడదంటారు. సింగినాదం జీలకర్ర! అని మాపినమామగారి కోడలు కూరతరిగితే గ్రహణమొర్రి వచ్చినది. ఒకప్లీడరుగారు గ్రహాణం పట్టిననాడు భార్యను కొట్టుటచే ఆమె ఏడ్చుటవలన ఆపిల్లకు యిప్పటికి కళ్ళు కనపడుటలేదు. ఇట్లాంటివి అనేక నాస్వానుభవం మీద నిజమో అబద్ధమో చూద్దామని 2తడవులు గ్రహణమొచ్చినప్పుడు, ఆ 2తడవలు చెవిపైన గోకినందువల వంకలా ఏర్పడినది. అది కూడ ఒక అందముగానేయున్నది. – పరీక్షపట్టిచూస్తేగాని తెలియదు. మావాళ్లు మంచిదానవేనని, ఇంకా నయం అని కేకలేసినారు. ఇవారాయడం అనవసరం

గర్భస్థ శిశువుకు అవయవములు ఏర్పడక ముందు 5, 6 నెలల్లో పట్టు ఎక్కువ, 7వ నెలలకు అవయవము లేర్పడును కనుక అంత పట్టులేదు. అయినను పనిచేయుచుండుట మంచిది. సోదరీమణులు పెద్దవాళ్ళమాట కొట్టిపారేయక జాగ్రత్తగా ఉండవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

### కాటుక నూరు విధానము

పై చెప్పిన విధముగా తాటాకుతో పళ్లెముగల కాటిక నూడ్చి, 4, 5 సార్లు వేసి, ఆపొడిని బోర్లించిన ఒక రాగిపళ్లెము మీదనుంచి దానిలో ఆవువెన్న కలిపి, ఒక రాగి పంచిపాత్రతో పావుగంట బాగుగా నూరవలెను. తరువాత మూడు చెంబుల నీరుబోస్తు బాగుగా నూరవలెను. మంచిగంధము అరగదీసి ఒక చెంబెడు నీళ్ళలో కలిపిన, బాగా తేరిన తరువాత వడగట్టి దానిలో, పచ్చకర్పూరము కూడ వేసి, ఈనీళ్లును పోస్తు నూరవలెను. ఆనూరిన ముద్ద రాగికాటికాయిలో పెట్టుకొనవలెను. వెండికాటికాయి కన్న రాగికాటికాయి శ్రేష్టము. చంటి పిల్లలైన యెడల పొడుం ఆముదంతో కలిపి పెట్టెదరు. కళ్లపొరలు కోయును. 5, 6 నెలలదాకా నూరిన కాటుక పెద్దవాళ్ళు, పిల్లలు పెట్టుకున్నయెడల కళ్ళకు చలువచేయును.

యిప్పుడు నాగరికతా వ్యామోహముచేత యిత్తడిపాత్రలు వాడుచున్నారు. గాని రాగి పాత్రలు శ్రేష్టము. రాగిపాత్రలో నీళ్లు త్రాగినయెడల అమృత మగును. డాక్టర్లు కూడా కాచి వడగట్టిన నీళ్లు చల్లార్చి రాగిపాత్రలో పోసి త్రాగమని చెప్పెదరు. అనారోగ్యముగనున్న వంటకయినను యిత్తడిపాత్రలకంటే మంటి పాత్రలు శ్రేష్టము. వాని తరువాత రాగివి; తరువాత కంచుపాత్రలు. ఇత్తడిపాత్రలు చిలుమారును. యల్యూమినియం పాత్రలు వాడుట మంచిదికాదు. విషతుల్యము. దంపుడు బియ్యపుఅన్నము బలముచేయును. కుండలో వండినన్నము చలువచేయును, ఆరోగ్యకరము. నాగరికత మీరి యిప్పుడు మరబియ్యమే వాడుచున్నారు.

### అగరు చేయుట

బాణలిలో పావుశేరు సగ్గుబియ్యం మాడవేయించవలెను. కాగితం ముట్టించి మాడివేగిన బియ్యంలో వేయవలెను. బుసబుస పొంగి మెత్తగా అయిన తరువాత గిద్దెడు నీళ్లుపోసి బాగా కలియపెట్టి చిక్కపడేదాకా పొయిమీద ఉంచి దింపి, దానిలో అగరు నూనెకలిపి, లక్కపిడతల్లోపోసి యెండబెట్టవలెను. ఇప్పటిబిడ్డలకు బొట్టుపెట్టుటే మానినారు. దిష్టిపరిహారముగా కాటిక బొట్టుపెడితే బిడ్డలు కళకళ్లాడుచుండెదరు. బియ్యంతో కూడా పై చెప్పిన విధంగా వేయవచ్చు.

శ్రీమతి ఏ. లక్ష్మి సుందరీశ్వరి జ్ఞానప్రసూనాంబ

# ఇంటిపనులలో మెళుకువలు

—(o)—

## గ్రహణాలు. గర్భిణీ స్త్రీలు

ఆవేళ చంద్ర గ్రహణం. మాపొరుగు రత్తమ్మగార్కి ఆరో నెల. నాకు కూడా ఆరో నెలే; సాయంత్రం ఆరుగంటలకు పట్టుట. అన్నం పొయిమీద బెట్టి తోటకూర ఏరుతూ ఉన్నా. రత్తమ్మగారు ఎక్కడ కనిపించలేదు. ఏమి చెప్మా! ఎక్కడికైనా వెళ్లారేమో! యని అడిగా వాళ్లతల్లిగార్ని. ఇంట్లో ఉన్నారని చెప్పిందావిడ. పనిమానేసి వెళ్లా. రత్తమ్మగార్ని చూచా నసుకోవడమేగాని అట్లాంటి దృశ్యం అప్పటికదే చూడ్డం. పాపం, మంచానికి కట్టివేయబడ్డ మనిషిలా ఉంది. చేతులు కాళ్లూ కదపకుండా, "ఏమని" అడిగా. "గ్రహణం కదూ - గర్భిణీ స్త్రీలు ఇట్లా కదలకుండా పడుకోవాలి. లేకపోతే కడుపులోని బిడ్డకు ఏదో మొర్రో, తొర్రో వస్తుంది. అన్నట్లు మీరు కూడా పడుకోండి" అన్నారు రత్తమ్మగారితల్లి. నాకు నవ్వు ఆగిందిగాదు. "పాపం, అంత నిర్బంధించి ఆమెను అట్లా పడుకోబెట్టడం, అసలు ఒక పొజిషన్ లో కొంతసేపు ఉండడమే ఇట్లాంటప్పుడు కష్టంగదా! లేపుదురూ, మీనమ్మకాలు నాదస్తాలును" అన్నాను! "మీరు చదువుకొన్నవారు. మీకవేమి పట్టించవు. మాకు అట్లా ఉంటే ఎలాగు?" అన్నారు. "పోనీ నాకెందుకులేగాని ఇదిగో నేను తోటకూర తరుగుతున్నా. నేను సుఖంగా పురుడైతే నాబిడ్డ నేను కులాసాగా ఉంటే చూద్దురుగాని" అంటూ వచ్చేశా మాగదికి. నేను చేసేపని చూచి వారంతా తలో కమాట, కోపంగాను, సానుభూతిగాను అంటూనే ఉన్నారు. అన్నిటికి నానవ్వే జవాబు. ఇంతలో రత్తమ్మగారిఏడ్పు, అత్తగారికేకలు వినబడ్డాయి. ఏమిటా! అని వెళ్లా. అట్లా నిగడదన్ని పడుకొని గుడ్లుమిటకరిస్తూ చూస్తుంటే ఇంటి కప్పులోనుంచి ఏదో చీమ పడిందట. తటాలున పమిట ఇలా మెలిబెట్టి కన్నుతుడుచుకొందట. అంతలోకి అత్తగారు వచ్చారు. ఇంకేముంది "అయ్యయ్యో నీశార్థం తగలెట్టా, ముదనష్టందానా! నీకేమొచ్చిందే, నిక్షేపంలాటి బిడ్డకు ఎంత ప్రమాదం తెచ్చావే! నిన్ను కాల్చెయ్య." అంటూ ఒకటే అరుపులు, ఉరుములు పాపం రత్తమ్మగారితల్లి కాళ్ళసందున తలబెట్టుకొని వాపోతుంది. రత్తమ్మ వెక్కెక్కి ఏడుస్తుంది.

రత్తమ్మగారి పెనిమిటి ఉన్న గదిలోకి వెళ్ళా, "ఏమండీ! మీరు అంత చదువుకొన్నారుగదా! మీరైనా వారికి నచ్చచెప్పరేం, ఇంకా ఇట్లాంటి మూర్ఖపు వివాదాలు ఎందుకండీ? మీలాటి వారింట్లో కూడా ఇట్లాంటి విషయాల్లో తగువులేనా?" అన్నా! "ఏమిటోనండీ గ్రహించలేకుండా ఉన్నా" అన్నారు. "ఓహో! అట్లానా? అయితే మరి నాకు పుట్టేబిడ్డ మరీ వికృతంగా ఉంటాడనా మీ యభిప్రాయం!" "ఏమో చూద్దాంగ" అని అన్నారు అనుమానంగా. "సరే" అనుకొంటూ మామూలుగా నాపనులు చూచుకొంటున్నాను.

సకాలానికి ఇద్దరికి పురుడు వచ్చింది. నాకు చక్కని మగపిల్లవాడు. ఎక్కడైనా ఏమైనా వంక, ఉంటుందేమోనని జాగ్రత్తగా తనిఖీజేసుకొన్నారు. ఏవంకలేదు. కాని రత్తమ్మగారి బిడ్డపాదాలు త్రిప్పబడి ఉన్నాయి. అయ్యో! గతి, ఇంతా తోటకూర తరుగుతు, గెంతుతూ వంటవండేదానికి ఏవంకలేని

బిడ్డ, అంత జాగ్రత్తగాపడుకొని, కంటిలో పడ్డ నలుసు బట్ట మెలిబెట్టి తీసుకొన్నందుకా ఈ విడ్డూరం, అని అందరు ఆశ్చర్యపోయారు.

అప్పుడు నేను చెప్పేను. "గర్భిణీ స్త్రీ మనసులోఉండే ఆలోచనలనుబట్టే బిడ్డ తయారవుతుందని తల్లి ఎల్లప్పుడు సంతోషంగా ఉంటూ ఉండాలి. అందమైన బిడ్డలను, ఫొటోలనుచూస్తూ తన కుపుట్టబోయే బిడ్డ అందమైనవాడుగాను ఆరోగ్యమైనవాడుగాను ఉండాలని అనుకొంటూ ఉండాలి. వికలాంగులను సాధ్యమైనంతమట్టుకు చూడకుండాఉండాలి. ఇప్పుడు రత్తమ్మగార్కి ఇట్లాంటిబిడ్డ పుట్టడానికిగలకారణం ఆ దినం ఆమెమనసు బెదరగొట్టడమే. తాను బట్టమెలిబెట్టినందువల్ల పుట్టబోయేబిడ్డ కాళ్లో లేక చేతులో అట్లా మెలిదిరిగి ఉంటాయని ఘోషపెట్టారు. అప్పటినుండి ఆమె ఆ వికృతాంగునే తలుస్తూఉండి ఉంటుంది. "నాకు పుట్టేబిడ్డ కాళ్లు ఇలామట్టుకొని ఉంటాయి అనుకొంటూ ఉన్నందున తన బిడ్డ ఆకారం అట్లా మారింది. నేను ఆ సమయానికి తోటకూర తరుగుచున్నానుగదా, మరి నాకొడుకు ఏతొర్రి రాలేదేం? నామనసులో ఆ ధ్యాసయేలేదు. తెలిసిందా? గ్రహణాలు పట్టినప్పుడు, అమవాస్య పున్నమలనాడు, పిచ్చివాళ్లకు పిచ్చిఎక్కువ, సముద్రాలకు పొంగు ఎక్కువ ఎట్లాగో, అట్లే గర్భిణీ స్త్రీలకు మనోబలం ఆనాడు కొంచెం తక్కువగా ఉంటుందని నాఅనుభవం. అందుకుగల కారణం భూమికూడ గ్రహమేగనుక, ఒకదానికొకటి సంభందించి ఉంటాయి ఈ గ్రహాలన్నీ" అని చెప్పా.

మరొక సంగతి మా ప్రక్కవాటాలోదిగిన ఆవిడకు చాలాదగ్గిరకాన్పు. ఆమెకు భర్త అంటే సర్దాయే కాని బిడ్డలంటే అసహ్యం. ఇది ఆయింటివారికి ఇష్టంలేక ఆమె అంటే అందరికికోపం, అసహ్యం. ఆమెతో ఎవరు, కడకు భర్తకూడా సరిగా మాట్లాడరు, ప్రేమించరు. ఎవరెంత నీచంగాచూచిన తాను మాత్రం మొండికెత్తి ముఖం ముడుచుకొని తిరుగుతుండేది. ఆమెకు పుట్టినబిడ్డలుకూడా అట్లాగే తయారయ్యారు. మూడునాలుగేళ్లవరకు నడవలేరు. వాళ్లకు దగ్గరఆవిడకు అసలు సంతానంలేదు. బిడ్డలంటే చాలసర్దా. ఈ సారి బిడ్డపుడితే నాకిచ్చెయ్యమని అడిగింది మొదటామెను. 'సరేసరే' అని అనుకొన్నారు. "నీకు పిల్లలంటే పిశాచుల్లాగ ఉంటారుకూడా పాపం! ఆమె ప్రాణంగా చూచుకొంటుంది ఇచ్చెయ్య" మని తనభర్త బంధువులుకూడా అన్నారు.

ఇక ఇదేసందు, అదేమందు అనుకొంటూ పిల్లాడిని పెంపకానికిచ్చేసింది. ఆ బిడ్డలులేనితల్లి ఆ బిడ్డకు వేళకుతిండి, వేళకునీళ్లు, వేళకునిద్ర అతిజాగ్రత్తగాచూస్తూ, అపురూపంగా పెంచుకొంటూంది. కాని క్రమేపి అసలుతల్లి బుద్ధులే పట్టుబడ్డాయి. ఎంత జాగ్రత్తగా చూచినా మూడేళ్లదాక దేకడం, నాలుగేళ్ల వరకు అడుగువెయ్యలేకపోవడం, చీటికిమాటికి ఏడుపు, చీలికయ్యాలు. ఆ ప్రక్కనే ఉన్నవాళ్ల బిడ్డ ఆయీడుబిడ్డే ఆరోనెలలో కూర్చుండడం, ఎనిమిదోనెలనుండి పాకడం, పన్నెండోనెలనుండి నడవడం, ఎప్పుడూ హాయిగా ఆడుకోవడం - వీరందరు పోతపాలుబిడ్డలే. ఇవి వారి తల్లుల కడుపులో ఉన్నప్పటి పరిస్థితుల ననుసరించి ఉంటాయని చిన్న లెక్చరిచ్చాను.

పి. జె. శాంతమ్మ




పుష్పవైద్యమను శీర్షిక క్రింద కొన్నిమాసములనుండి ప్రచురించుచున్నాము. పుష్పధారణ పుణ్య నారీమణులకును, పూజాద్రవ్యములుగ దైవమునకు నుపయోగించును. పుష్పధారణచే శరీరతాపమును, దారుణమును బోగొట్టును. తల వెంట్రుకలకు సువాసన నిచ్చును. శిరోభారమును తగ్గించి కండ్లకు చలువచేయును. వాతోన్మాదము, మతిభ్రమను బోగొట్టి మంచి జ్ఞాపకశక్తినిచ్చును.

**మొగలిపువ్వు :-** అన్నిస్థలములయందు లభించదు. గుంటూరుజిల్లాలో, చీరాల, వేటపాలెము యిసుకపర్రల నేలలందు విరివిగ కానుపించును. మలబారు ప్రాంతముల సమృద్ధిగ లభించును. ఈ రెండు స్థళములు సమశీతోష్ణస్థితులలో నుండుటవల్లనే పకజాతి పుష్పములు వృద్ధియగుటకు కారణమయి యుండును.

మొగలిపువ్వు మంచి వాసననిచ్చును. దీనివాసనా వాయువులే మంచి త్రాచు పాములకు ఆహారము. మలబారు ప్రాంతమున దేవతా సర్పములు, నాగులువన్నె గాంచిన జాతులున్నవి. మొగలి బీళ్లు - పువ్వులతో కేతకి తైలమును తయారు చేసెదరు. మంచి తలంటు తైలములు; తలంటు నూనెలుకూడ తయారు చేసుకొని వాడిన, కుంతలముల సమృద్ధి, నిగనిగకాంతికలిగి, నాగులను మించిన అతి దీర్ఘములగు కురులతో కాంతి సమన్విత సుస్వరూపులైయుందురు. శిరస్సున దాల్చిన మనోవ్యాకులములు, వ్యాధులు దరిజేరవు.

**విరజాజి :-** దీనినే బొడ్డుమల్లియని పిలుతురు. వసంత గ్రీష్మఋతువులందు విరివిగ పూయును. సుకుమారుల మనస్సులకు ప్రియమయినది. దీనితో విరజాజి పుష్పాసవమును తయారు చేసికొనెదరు. అంతఃపురవాసులకు అమితానందమిచ్చును. ధారుణ్యామిచ్చి కాంతివంతులుగ జేయును. మంచి ఆకలిని కలిగించును. ఆహారమును జీర్ణింప చేయును. సుఖనిద్రనిచ్చును.





(గతసంచిక తరువాయి)

3 వ అంకము.

2-వ రంగము

రాయమారులో ముక్తాంబ నివాసగృహము

(ముక్తాంబ యొంటరిగా నుండగా, రామరాజ విజయసింహులు వత్తురు.)

ము:- అన్నా వచ్చితివా? ఇతడెవ్వరు? ఇందరికి వెల్లడియైనదో మనరహస్య మెట్లుదాగును?

రా:- సంశయింపకుము. రహస్యముల వెల్లడించు చిత్తచాంచల్య మీతనికిలేదు. మనకాప్తుడే.

ము:- యీపర్యాయము విజయునిదప్పించుట కష్టమే సుమీ! తోఫల్ ఖానే యీపని చేయించెను గాని యాదిల్ షాహా యిట్టి సాహసంబున కొడిగట్టునా?

రా:- అమ్మా! ఆరోజు సభలోనుండియు నిట్లు బల్కెదవేల? ఆదిల్ షాహా మాత్రము సామాన్యుడా? రామయ్యామంత్రి సలహాచేతనే యింతపని జేసినాడు.

ము:- అవునవును. నేను విచారపరీత హృదయనైయుండుట చేతనేమియు జ్ఞప్తిలేకపోయినది. ఆదిల్ షాహా ముందు చెప్పగా రామయామాత్యుడు బలపరచినాడు. తాము యుద్ధసన్నద్ధులైనట్లు రాయలకు దెలియకుండనుండుటకే యీపనిచేసినాడు గావున విజయునకు ప్రాణభయముండరాదు.

రా:- వానికట్టి దలంపులేదు కాని రామయ్యామంత్రి విజయునకు గర్భశత్రువు. ఖానునకు రామయ్యామంత్రి మిత్రుడు. ఖాను మిత్రవాక్యము నుల్లంఘించడు. విజయుని జీవంబులు ఖాను చేతిలోనున్నవి, యేమగునో!

ము:- (విచారముతో) అన్నా రామయ్యామంత్రి నాకు హితకార్యంబులు పెక్కుగావించుచున్నను యీ విషయంబున మాత్రము కఠినత్వము బూనినాడు. నన్ను రుద్రదేవుని వరింపమనుచున్నాడు.

అతనియెడ నా కెంతమాత్ర మిష్టము లేదు. అనంగతి గట్టిగా జెప్పినచో నితర వ్యవహారములలో విముఖుడగునేమో యని సంశయముగా నున్నది.

రా:- ధైర్యము వహింపుమమ్మా : తిమ్మరుసు జెప్పిన యుపాయంబున విజయుని దప్పింప యత్నించితిమి.

ము:- ఎట్లు దప్పింతురు ? అసాధ్యము సుమా! పాపము విజయుడు మిగుల దురదృష్టవంతుడుగదా? యెప్పుడా పద-లే యెదురొచ్చుచున్నవి.

వి:- నిరుపమాన శేముషీ ధురందరురాల వై, రాజకీయజ్ఞాన నిపుణమతివై, అపార ప్రేమస్వరూపిణివైన నీప్రేమకు పాత్రుండనైన నేను దురదృష్టవంతుడ నెట్లగుదును? నేను ముమ్మాటికి కాను. నేనదృష్టవంతుడనే,

ము:- (ఆశ్చర్యముతో) విజయుడేనా ?

రా:- అవునమ్మా! మేమత్యంతకష్టముమీద నితనిని బంధనమునుండి దప్పించితిమి.

ము:- అన్నా ! యెంత ఘనకార్య మాచరించితివి ? కారాగృహాధికారినే మోస బుచ్చితివిగా ! నీవుచేసిన సాహసకృత్యము విన కుతూహలముగ నున్నది. వివరముగా చెప్పుము.

రా:- ఖాననంగసేనను జూడబోయినపుడు మాలతి అతని చేతి యానవాలుంగరము కాజేసినది.

ము:- వుంగర మెట్లిచ్చినాడతడు ?

రా:- అనంగసేన రోగపీడితయై యున్నట్లును, మందులేక ప్రాణాపాయము సంభవించుచున్నట్లును, ఖాను వచ్చునప్పటి కేడ్చుచు దీనాలాపములాడెను. ఆమెకు పురములోనికిపోయి మందు తెచ్చుటకాటంకములేకుండుటకై ద్వారపాలకులకు జూపుటకై యుంగరమిచ్చినాడు. ఖాను పేరు చెక్కియున్న యుంగరముగాన మేమది జూపి కారాగారమునందున్న విజయుని విడిపించితిమి.

ము:- నేడెంత సుదినము.

వి:- ప్రియా ! నాకానాడు ప్రాణాదానముగావించినది మొదలు నీకు నాకృతజ్ఞతను దెలుప దలంచినాను. కాని సమయము దొరకలేదు. నీవుదూరమైతివి.

ము:- ఇంతమాత్రమునకు నాకు కృతజ్ఞత దెలుపవలెనా ? నా కుపకార మొనర్చి నాచే కృతజ్ఞతను బొందురోజు వచ్చినది సుమా !

రా:- ముక్తాంబా ! యెంత సాహసమునకు గడంగితివి. నీవు ఖానుని మెప్పించి వానిసాయంబున విజయనగరంబుపై దండెత్తుటకు గదా నీ ప్రయత్నము అమ్మా ! నీ క్షోభమదియేల ! యెన్ని రాజ్యంబు లేకీభవించినను కృష్ణరాయలను ఎదిరించి జయించలేవు.

ము:- ఏమట్లనెదవు ?

రా:- ఎన్నిరోజుల నుండియో శ్రమజెంది రామయ్యమంత్రి గావించిన తురుష్క రాజ్యత్రయాసంధిని యొక్క ముహూర్త మాత్రమున తిమ్మరుసు భేదింపజేసె. వీరెవ్వరు నీకుసాయపడరు; నీవిభ్రమను వీడి నే చెప్పిన చొప్పున జేయుము.

ము:- ఏమి చేయమందువు?

రా:- మేము మాపనులు చక్కబెట్టుకొని త్వరలో నిటనుండిపోవుదుము. అపుడు నీవు తగినతోడ్పాటులేక యొంటరిగా నిటనుందువు. అప్పుడీ తురుష్కులచే నీకేమి కీడుమూడునో చెప్పజాలము. కావున మావెంట బయనమైరమ్ము. నిన్ను సురక్షిత స్థలమునకు జేర్తుము.

ము:- నాకొఱకై యిన్ని యిక్కట్టులబడుచున్న మంత్రిని, నాసంరక్షకుడైన గ్రహారేశ్వరపాత్రుని విడచిరా గాళ్లు రాకున్నవి, మీ యుద్దేశ్యమేమి?

వి:- ముక్తా! నీవు మంత్రియెడ జూపుచున్న విశ్వాసమునకు మా కానందము గల్గె. మీ రిదివరలో ననేక మోసంబులుజేసి రాజమంత్రులకు కోపము గల్గించియున్నారు. గావున ముందుగా ప్రార్థనాపూర్వకమగు లేఖ నొక్కటి వ్రాసి మంత్రికి బంపుము.

రా:- సోదరీ! విజయుని సలహా బాగున్నది; అట్లుచేయుము. ఇక నేబోయెద. మీ రిద్దరును జాగరూకతతో నుండుడు.

ము:- ఇతని నెట్లు గాపాడుదు? ఇందు వర్తించు గ్రహారేశ్వర పాత్రునకు దెలియునేమో!

రా:- (నవ్వుచు) యితనికి నీవనిన నెంత ప్రేమయో, కారాగారమన నంత ప్రేమ గావున యీ మందిరమున బంధింపుము; కోటదాటి బోయినచో సకాలమునకు రాలేను. నేనుబోయి వత్తును. (పోవును)

౩-వ రంగము,

ముక్తాంబ గృహము ముందర

(ఫకీరు, మలమలఖాను, ప్రవేశము.)

ఖాను:- మనమిచ్చట కేతెంచినట్లు ముక్తాంబకు దెలియ జేయుటెట్లు? నీవామెతో మాట్లాడి నావుగదా? ఆమె నాయెడ ననురాగము గల్గియున్నట్లు గాన్పించెనా?

ఫ:- ముక్తాంబ హృదయము నవనీతము. నీయెడ ననురాగము గల్గబట్టియే పరిణయమునకు పూర్వము నీతో భాషింప నిచ్చగించినది.

ఖాను:- రామయ్య మంత్రి మహాకపటి. తొలుత నాయుద్దేశ్యము విని సందేహించెను. నాకేమైన యవమానము నొసర్చునేమో.

ఫ:- నీవల్ల నెక్కువ యుపకారంబు నందగోరుచున్నవారు నీకవమాన మెట్లు సేతురు? అట్లుచేసిన పక్షమున తమ రాజ్య సంపాదనా ప్రయత్నమునకు తామె విఘ్నముచేసుకొన్న వారగుదురు

ఖాను:- అవునవును. చక్కగా చెప్పినావు. యిక నా మీను బిలవుము. (ఫకీరు తలుపు దట్టగా ముక్తాంబ తలుపుదీయును.)

ఫ:- అయ్యో నేనిందేయుంతును. తమరు లోనికేగుడు. ఖానులోన ప్రవేసించును.)

యొక అర్ధగంటకు ఖాను వికృతాకారముతో వచ్చును -

(ఫకీరు ఆదుర్దాగా)

ఏమిఖాన్, నీకోర్కె నెరవేరెనా ?

ఖాన్: అయ్యో అల్లా! నాగడ్డంసూడూ ఆసైతన్ నాకీహెంత సేసిందో (మీసం గడ్డం చూపును)

ఫ:- ఆమె యింత జేయునా? యిదియంతయు రామయ్య మంత్రియే చేసియుండవచ్చు. అదియుంగాక రుద్రదేవుడామెను ప్రేమించు చున్నాడట. వాడే యిట్లుచేసి యుండనోపు. పోనిమ్ము అల్లా దయవల్ల, నిన్ను ప్రాణంబులతో వదలినారు పొమ్ము వీరికిక సాయము మాత్రము జేయుకుము.

ఖాను:- యీ సైతానుల కింకా సాయం చేస్తానా? నీవునాకోసం చాలాశ్రమ పడ్డావు. నీకి వక్కసలాం సేస్తాన్. నేను యెల్లిపోతాన్ మాదేశాన్కి, (పోవును).

(సశేషము)

[తెర]





# సాధ్వి

రచన: శ్రీమతి వంగల వాణీబాయి

(గత సంచిక తరువాయి)



## 2 వ భాగం

ఒకటి, రెండుసార్లు అమ్మగార్ని సెలవడిగి, ఆశ్రమంలో ఉన్న తన సహవాసులను చూచి వస్తానని చెప్పి వెళ్లిపిల్లల్ని చూచి వచ్చింది సుమతి. పిల్లలు వెనుకటికంటే బాగున్నారు. చదువుకొనుచున్నారు. సంతోషించింది. ఇక్కడ అమ్మగారి పెత్తనాలు అంత కంతకు అధికమై పోతున్నాయి. ఒక్కొక్క రోజు భోజనానికిఇంటికొచ్చేదికాదు. "ఫ్రెండ్సు"తో భోంచేసి వస్తాననీ చాలా నిర్బంధ పెట్టుతున్నారనీ "ఫోను" చేసేది. నరేంద్రకు మనస్తాపం ఎక్కువ అయింది. ఏమార్గం, తోచడం లేదు. ఆబిడ్డలనైనా తెచ్చుకు తన దగ్గరనే పెట్టుకుందామా అనుకొన్నాడు. కాలక్షేపమైనా అవుతుందని. అసలు నరేంద్రకు మొదటినుంచీ "క్లబ్బులైఫ్" "సోషల్ లైఫ్" ఎక్కువ ఇష్టంలేదు. తన భార్యదొకదారి, తనదింకొక దారి ... ...

ఒకనాడు సుమతి నరేంద్రబయటకు పోయేదుస్తులు శుభ్రంగా "బ్రష్" చేసి అన్నీ తయ్యారుగా పెట్టుచూన్న సమయంలో "ఆశ్రమాన్నించి బిడ్డల్ని తీసుకువచ్చి ఇంట్లోనే ఉంచుదా మనుకొంటున్నాను. వాళ్ల సౌకర్యాలన్నీ కనిపెట్టి చూచుకొంటావా?" అన్నాడు నరేంద్ర. అంతకన్న కావలసిందేముంది; తప్పకుండా చూచుకుంటాను తీసుకురండి పంతులు గారూ అంది తత్తరపాటుతో సుమతి. సుమతి మాటలు విన్నప్పుడల్లా తనను ఎవరో ఎరుగున్న గొంతుతో పిలుస్తున్నారా అనిపించేది నరేంద్రకు.

ఇన్ని సంవత్సరాలుగా ఈబిడ్డల్ని పెంచి, కనిపెట్టి చూచినందుకు కృతజ్ఞతా పూర్వకంగా పదిహేను రూపాయిలు విరాళం ఆశ్రమానికి అర్పించి, పిల్లల్ని తన ఇంటికే తీసుకువచ్చి, వాళ్ళకోసం వేరుగా ఒక గదిని అమర్చి, ఉండజేసెను. సరోజకు ఇది ఎంత మాత్రము నచ్చలేదు. ఈ పల్లెటూరి గబ్బిలాయిలు ఎవరంది? ఇటువంటి నీచుల్ని తన ఇంట ఉండనీయనంది. తన స్వంతపరిచారిక సుమతి ఆమురికి పిల్లల దగ్గరకు వెళ్ళడానికి వీల్లేదన్నది! కాని అన్నిటికి తయ్యారుగానూ, ధైర్యంగాను కూర్చుని ఉన్న నరేంద్ర ఈపిల్లలిక్కడే ఉండితీరుతారనీ, కావాలంటే సరోజయే ఇల్లువిడిచి పోవచ్చుననీ ధృడము జవాబిచ్చాడు.

ఆరోజు మొదలు భర్త తన మాట చెల్లనీయలేదని గొప్ప ఆగ్రహం కలదై, తాను మరియొక ఆయాని పెట్టుకొని, తన పాత ఆయా సుమతిపైనా, భర్త మీద, ఆ అమాయకులైన బిడ్డలమీద అసూయచెందినదై, పగకట్టి అనేక కుట్రలు, పన్నాగాలూ, చేయనారంభించింది.

సరోజ నరేంద్రలకు పచ్చిగడ్డి వేస్తే భగ్గుమనేటట్టుంది. అపిల్లల్ని ఇంట్లోనించి తరిమేస్తేనేగాని నరేంద్రతో మాట్లాడనంది సరోజ. సరోజ ఇంటినుండి పోయినా తన ఆత్మ స్నేహితుని బిడ్డల్ని ఇంటినుండి తీయనన్నాడు నరేంద్ర. బిడ్డలు ఇక్కడకు వచ్చినప్పటి నుంచీ, చదువూ సంగీతం మొదలైనవి బాగా నేర్చుకొనుచున్నారు. ధరించుటకు మంచి మంచి దుస్తులు, ఆభరణాలు గూడా యివ్వబడ్డాయి. సుమతి పిల్లల దగ్గరనే ఉండి చక్కగా వాళ్ళకు ఏ లోటూ కలగకుండా పోషణ చేస్తోంది. నరేంద్ర వాళ్ళను రోజూ కారుమీద బైటకు తీసుకువెళ్లి త్రిప్పి తీసుకు వస్తూ ఉండేవాడు. ఒకొక్కప్పుడు విశ్రాంతి సమయంలో వాళ్ళ అమ్మా, నాన్నలను గురించి వాళ్ళకు తెలిసినమట్టుకు చెప్పమని అంటూ

ఉండేవాడు. ... పాపం, ఆ యనాయకులైన పిల్లలు, తమ అమ్మ రైల్లో వెళ్ళి, రైలుప్రమాదంలో చిక్కుకుని, చనిపోయిందని విన్నామనీ, వాళ్ళ నాన దుర్మార్గుడై, వీరిని ఎక్కడో వదిలేసి పారిపోయినాడనీ, వాళ్ళ కంతకంటే మరేమీ తెలియదనీ చెప్పేవాళ్లు. "ఇప్పుడు మాకు భగవంతుడే, మిమ్మ తండ్రివలెనూ, ఈ పరిచారిక సుమతిని (దాసి అయినప్పటికినీ) తల్లివలెనూ, మాకేలోటూ తెలియకుండా చూపించాడు." అని ధన్యవాదాలు తెల్పుతున్నట్లు పల్కేది పెద్దపిల్ల. ఇవన్నీ వింటూన్న నరేంద్రకూ, ఏ తలుపు చాటునో, నిలబడి వింటూన్న, సుమతికీ దుఃఖాశ్రువులు రాలుతూ ఉండేవి. కాని తానే ఆ బిడ్డలకు తండ్రినని నరేంద్ర గాని, తానే వారి తల్లినని సుమతి గాని చెప్పక పోయిరి.

ఈలోగా సరోజ అనేక కుట్రలు పన్ని, చివరికి ఈ పిల్లలతో మెల్లిగా స్నేహం చేసుకొని అప్పుడప్పుడు వారిని తన గదికి ఆహ్వానించి, కాఫీ మొదలైనవి త్రాగించడం, పెప్పరమెంట్లు, బిస్కట్లు తినిపించడం ప్రారంభించింది. ఇది అంతా చూస్తూ ఉన్న సుమతికి అప్పుడే అనుమానం తోచింది, కాని తానే జాగ్రతగా ఉంటే మంచిది గాని, అనుమానమున్నదని నరేంద్రకు తెలిస్తే కోపం వస్తుందేమోనని ఎవరితోనూ ఏమీ అనకుండానే తానే కనిపెట్టి చూసుకుంటోంది. ఇట్లా కొన్నాళ్లుగడిచాయి. సరోజ దారిలో పడుతోందనుకొని సంతోషించాడు నరేంద్ర. ఒక్కనాడు పెద్ద అమ్మాయి పుట్టిన దినమని వేడుకలు చేసుకొంటున్నారు. ఆరోజు సరోజ ఎంతో ప్రేమగలదానిలాగా ఆపిల్లలను తన గదికి పిలిపించి ఎన్నో బహుమానాలు ఇచ్చి త్రాగేందుకు "టీ" తినేందుకు అనేకరకాల మిఠాయిలు, పండ్లు మొదలైనవి కూడా ఇచ్చి, ఆరోజు కొంతసేపు పిల్లలచేత రాధా, కృష్ణుల, నృత్యాలు చేయించి, వీరిని ఎంతో ఆనంద పరచి వారి వసతికి పంపింది. ఇది అంతా చూస్తూనే ఉన్న సుమతికి ఎందుకు ఇట్లా చేస్తోందా అని అనుమానం ఉన్నప్పటికీ, అంతమంది పిల్లలంతా వచ్చి మంచి వినోదసమయంలో ఉన్నప్పుడు, ఏమీ చెడు జరగదనుకొంది. పాపం!

అక్కడినుండి తిరిగివచ్చింది మొదలిద్దరూ తల త్రిప్పుతోందనీ, కడుపులో బాగాలేదనీ, అని కొంతసేపటి తర్వాత వాంతులు చేసుకోనారంభించారు. సుమతికి కాళ్లూ చేతులూ ఆడడంలేదు. ఏమి చెయ్యాలో తెలియడంలేదు. నరేంద్ర ఆరోజు ఇంకా ఆఫీసులో ఏదో అర్జెంటు పనిమీద ఉండిపోవాల్సియింకా రాలేదు. ప్రమాదస్థితికి వచ్చిందని తెల్సుకొంది. వెంటనే వీరింటికి మామూలుగా వస్తూ ఉండే డాక్టరుగారికి తక్షణం రావల్సిందని ఫోను చేసింది. నరేంద్రకు కూడా తక్షణం రమ్మని ఆఫీసుకి ఫోను చేసింది. డాక్టరు వచ్చాడు. వెంటనే ఇద్దర్ని (Ambulance) యాంబులెన్సు (అనగా రోగులకొరకు ప్రత్యేకం ఉపయోగించబడే ఆసుపత్రి కారు) మీదనే హాస్పిటల్ కి చేర్పించిచారు. పెద్దడాక్టరు పరీక్ష చేసి పిల్లలిద్దరికీ ఒకేరకం వ్యాధి అనీ అది (Case of slow poisoning) నిదానం మీద ప్రాణాలుతీసే నల్లమందు ఇవ్వబడ్డదని చెప్పాడు. వీలైనంతమట్టుకు విషమంతా క్రక్కించేస్తున్నాడు. అబ్బాయి కొంచెం తేరకుంటున్నాడు. కాని అమ్మాయి స్పృహతప్పి పడిఉంది. ప్రక్కనే సుమతి కూర్చుని ప్రార్థనలు చేస్తోంది. నరేంద్ర తిన్నగా హాస్పిటల్ కేవచ్చిచూశాడు. బిడ్డలను వెంటనే హాస్పిటల్ లో చేర్పించినందుకు సుమతి నెంతయూ కొనియాడాడు. అప్పుడు సుమతి, పిల్లల్ని సరోజ టీపార్టీకి పిలచిన సంగతీ మిఠాయిలు పెట్టినసంగతీ అంతా తెలియజేసింది. వెంటనే పోలీసు పరిశోధనలుచేసి నరేంద్ర భార్య సరోజను (Lock up) ఖైదులో పెట్టారు. విచారణలు జరుగుతున్నాయి. ఇంతలో ఇక్కడ అమ్మాయి ఇంకా చావుబ్రతుకుల మీదనే ఉంది. అబ్బాయికి బాగానే నయమై పోయింది. మూడవనాడు పిల్ల సంధిమాటలు (Delerium) ప్రారంభమై ఏదోపిచ్చగా మాట్లాడుతోంది; సుమతి పిల్లచెయ్యి పట్టుకొని ప్రక్కనే కూర్చుని ఉంది.

అమ్మాయి ...... "అమ్మా పిలుస్తున్నావా? నీ దగ్గరకే వస్తున్నానమ్మా. తమ్ముడొక్కడే ఇక్కడ ఎట్లా ఉంటాడమ్మా" అంటూ ఎన్నెన్నో ఈ మాదిరిగానే పలుకుతోంది. సుమతి వెక్కి వెక్కి

ఏడుస్తూ తన కళ్లజోడుతీసి ప్రక్కగాపెట్టి కళ్లు తుడుచుకొంటూ, "చిట్టితల్లీ, నేనేనమ్మా నీ అమ్మను. ఎక్కడికీ వెళ్లవద్దమ్మా, నాదగ్గరే ఉండమ్మా" అంటూ పిల్లచెక్కిళ్లపై తన ముద్దులు కురిపించుతూ ఏడుస్తూ ఉన్నసమయంలో – ముందు చెప్పకుండానే, హఠాత్తుగా బిడ్డల్ని చూపించడానికి నరేంద్ర, సుందరమ్మగార్ని తీసుకురావడం తటస్థించింది. ఈ పరిచారిక రోగితో అంటూన్నమాటలు చెవిని బడ్డవాడై సుమతివంక చూడగా ఆమెయూ ఈ దుఃఖములో తన కళ్లజోడును వేసికొనుటమరచి ఒక ప్రక్కకుతిరిగి ఉండగా నరేంద్ర సుమతిని గుర్తుపట్టినవాడై...... "సుమతీ నీవెట్లు వచ్చావని" గట్టిగా చేయిపట్టుకొన్నాడు. ప్రక్కనే నిలబడియున్న సుందరమ్మగారు అత్యంత ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయింది. సుమతి అప్పటికి తన కళ్లజోడు ధరించడం మరిచానని జ్ఞాపకం తెచ్చుకుంది. తాను నరేంద్రభార్య సుమతినని, జరిగినదంతా తరువాత చెప్తాను. ముందు బిడ్డను బ్రతికించమనీ ప్రార్థించింది. సుందరమ్మగారి చరణాలకు సాష్టాంగనమస్కారం చేసింది. తనను మన్నించమనీ, తనకు బిడ్డలమీదగల మమతమూలాన్ని తాను వారింట పనిమానినాననీ చెప్పింది. నరేంద్రకు తాను పునర్జన్మ ఎత్తినట్లు తోచింది. సుమతి తన కథఅంతా రైలుప్రమాదమై రెండుమాసాలు హాస్పిటల్‌లో ఉండి చికిత్సపొందుట, ముక్కుసొట్ట, కాలుకుంటి, తనకు ప్రాప్తించుట, మొదలు అన్నీ చెప్పింది. నరేంద్ర తనను స్వీకరించడనేభయమువల్లనే దాచి ఉంచానన్నది తాను బొత్తిగా కురూపినై, గుర్తుకూడా పట్టజాలకుండా ఉండడంవల్ల తన బిడ్డలకుకూడా తల్లినేనని చెప్పలేదంది. నరేంద్ర తనను క్షమించమన్నాడు. సుమతి, తాను ఇప్పుడు చాలా కురూపిగా ఉన్నందున, అతని 2వ భార్య సరోజనే క్షమించి విడిపించి తెచ్చుకోమని తానూ తన పిల్లలూ వేరుగా ఉంటామనీ సుమతి చెప్పింది. క్రమేప పిల్ల ఆరోగ్యం చెందుతోంది.

కోర్టులో ఈ పిల్ల సాక్ష్యంకూడా తీసుకున్నారు. సరోజ తనను పిలిచి "టీ" మిఠాయిలు మొదలైనవిపెట్టి ఆ రోజు ఎంతో దయగలదానివలె ప్రవర్తించినదనీ, అవి అన్నీ తినివచ్చిన కొంచెంసేపటి తర్వాతనే, తనకు, తన తమ్మునకూ గూడ వాంతులు ప్రారంభించినట్లు, ఆపైన ఏమైందీ తనకు తెలియదనీ ఆ పిల్ల కోర్టులో చెప్పింది. సరోజదగ్గర ఉంటూన్న క్రొత్త ఆయాను గూడ పిలచి సాక్ష్యం అడుగగా, అది తన అమ్మగారు తన చేతనే రహస్యంగా నల్లమందు తెప్పించినట్లూ ఆ మందు కొంతమిఠాయితో మాత్రం కలిపినట్లు – ఆ మందు కలిపిన మిఠాయి వేరుగా ఈ పిల్లలకే పెట్టినట్లూ, మంచిది ఆ మాదిరి మిఠాయే మిగతా పిల్లలందరకీ పెట్టినట్లూ, ఈ విషయం ఎవరికినీ తెలియనీయకూడదనీ, చాలా రహస్యమనీ చెప్పి అందుకు తనకు లంచాలు చాలా అమ్మగారు ఇచ్చినట్లూ అన్నీ ఆ క్రొత్త ఆయా చెప్పి అమ్మగారు ఇచ్చిన లంచాలలో బంగారుగాజులు కూడ ఉండటంవల్ల బీదదికాబట్టి తాను ఆశగలదై అట్లు చేశాననీ, తనను క్షమించమనీ కోర్టులో ఏడువసాగెను. కోర్టులో నరేంద్ర సాక్ష్యం – సుమతి సాక్ష్యంకూడా తీసుకున్నారు. సరోజద్రోహి అని రుజువైంది. బిడ్డబ్రతికింది గదా, అని 10 సంవత్సరాలు కఠినశిక్ష విధించారు. పాపం, "సోషల్ లైఫ్ లేకుండా బ్రతుకజాలని సరోజకు జైల్లో ఎట్లా తోస్తోందో! క్లబ్బుల్లోనూ, రేసెస్‌లోనూ కూడా ఆమె "ఫ్రెండ్స్" ఆమెను చాలా "మిస్" చేస్తున్నారు. నరేంద్ర సుమతీ, బిడ్డలు దొరికారని మహానందబడ్డాడు.

సమాప్తము.

---

# ఆదర్శమిథునం

శ్రీ చీమలపాటి
సూర్యనారాయణరావుగారు

(గతసంచిక తరువాయి)

అంటూ ముసలి కన్నీరుకార్చి, ప్రాధేయపూర్వకముగాఁ బ్రతిమాలాడు. భైరవశాస్త్రి పరిస్థితులను హృద్గతం జేసుకున్న జగదాంబ తండ్రికి హృదయం కరిగింది. పైగా - యీకరువుకాలంలో అతనికి పద్నాలుగుర్ని అందులో - పదిమంది ఆడపిల్లలను పోషించటం చాలాకష్టంగాను, భారంగానేయుంది. ఒక్కరొక్కర్నే యేదోవిధంగా అతిత్వరలోనే తనయింటిలోనుండి సాగనంపి యీచెత్తనంతా తుడిచివేసి, తన 'మాణిక్యము' (మిగిలిన ?) లతో సుఖంగా కాలక్షేపం చేద్దామని యుత్ప్రేక్షించిన జగదాంబ తండ్రి వెంకటనారాయణస్వామికి మంచి అవకాశం - కోరినంతధనం (అల్లునిమూలంగా) పరిస్థితులు అతని సమీపములోనికివచ్చి, అతనికిని యీఘనకార్యం జేయమని ప్రోద్బలపరిచాయి.

వివేకశూన్యుఁడై - తన కుమార్తెయొక్క భావిసుఖాన్నైనా యోచించకుండా, తనకు కోరినంతధనం వస్తుందని, పైగా - యీ 'పిశాచపు' బాధ వొదిలిపోతుందని, ఎంతో సంతోషించి, తనమేనల్లుడు భైరవశాస్త్రి కోరినట్టుగానే తు. చ. తప్పకుండా యాచరించి, వొక దీర్ఘనిశ్వాసం విడిచిపుచ్చాడు, యేదో భారం తనలోనుండి సడలిపోయినట్లు. 'ఆడపిల్ల'నగానే - తండ్రికెంత చులకనైపోయిందని?

జగదాంబ, తనకు తన బావకు యీడూ జోడూ సరిపడనప్పటికి, యింటిదగ్గర తోబుట్టువులు (?) తండ్రిపెట్టే దుర్భర కష్టపరంపరలను సహించుకోలేకపోయింది. తనకు వివాహంఅయిన తరువాత యింటి దగ్గరకన్న, అత్తింటను ఎక్కువ సుఖమననుభవించవచ్చునని యాశించింది.

కానీ, రెండుస్థలములందు తనకు 'సుఖం' వొక్కవిధంగానే యున్నదని దెలుసుకున్న జగదాంబ కృంగిపోయింది. ఆమెయేగాకుండా, ఆమె శరీరములోని ప్రతీ అవయం కృంగిపోయింది. భైరవశాస్త్రి వొట్టి అనుమానపు మనిషిని, కోపిష్టి మనిషిని ప్రయోగకంగాను తిలకించిన జగదాంబ జీవితంలో ఆనందం సడలిపోయి, నైరాశ్యం అలుముకొంది. ఆమె జీవితంలో సంతోషం శూన్యమైంది; ఆనందం ఆడుగంటింది.

జగదాంబ - తనజీవితాన్ని తానే అసహ్యించుకుంటుంది. జగదాంబ - యీవిశాల విశ్వంలో ఏకాకి, వున్నా - యీమె గోడు యెవ్వరూ పట్టించుకోరు; భగవంతుని సృష్టిలో ఓ నీచాతి నీచమైన జీవితాన్ని గడుపుతూన్న 'కీటకం' మాత్రమే! మరే యితర కీటకానికైనా - యానందం లవలేశమయినాయుంటుంది; యీమెకుమాత్రంలేదు...

జగదాంబకు, భవిష్యత్తుఁ జెప్పించి, మిగిలిన కాలములలోని జీవితం స్మృతికిరాగానే, గుండెలు చెక్కలయ్యేటట్లు విలపించింది. భైరవశాస్త్రి యింటిలోలేని సమయమునందు హృదయం వుబ్బి విచ్చుకుపోయేటట్లు యేడ్చేది - మొత్తుకునేది. ఆమె యెంతఏడ్చి మొత్తుకున్నా, భర్తనుండి 'దెబ్బ'లను తినేదికాని, యెవరూ సానుభూతి చూపేవారుకాదు! కష్టాలయొక్క లోతుపాతులను, నిమ్నోన్నతమును తెలుసుకున్న నేను - సానుభూతి చూపేవాడిని. నా సానుభూతి : సముద్రుడులోని కాకిరెట్టగా పరిణమించేది.

భైరవశాస్త్రి యింటిలో లేనప్పుడెల్లా, ఆమెను - నేనూ, మా యావిడ ధైర్యవచనాలను జెప్పి కొంచెం మనస్సును శాంతిని చేకూర్చేవారము. అందుకామె యెంతైనా సంతోషించింది .. భైరవశాస్త్రి - వాస్తవంగా - మానవజాతిలో జన్మించవలసినవాడు కాదు: 'లంక'లో దప్పె. వొడిగండమూర్ఖుడు: తాఁబట్టిన కుందేలుకు మూడు కాళ్ళని వాదించేరకం! తనసుఖాన్ని, వృద్ధిని కోరే వ్యక్తిగాని - ఎదుటి మనుష్యులసుఖాన్ని, వృద్ధిని కోరేవాడు గాడు! పైగా - చదువుకున్నవాడు: గ్రాడ్యుయేటు!

నిత్యమూ - జగదాంబ ఆరోగ్యములో హెచ్చు తగ్గులున్నప్పటికి - ఆమె వలదని మొఱపెట్టుకున్నప్పటికీ - ఆమెను గంటల తరబడి అనుభవిస్తూయుంటాడు. అతనిమాటను యామె తృణీకరించిందా! హంటరు, ఆకారం ఆమెశరీరంమీద యున్నదన్నమాటే!- వెంకటనారాయణస్వామిదగ్గర - నీకూతురిప్పె పువ్వులలో పెట్టి పూజిస్తానన్నదానికి క్రియ యిదే!

భైరవశాస్త్రి - అనుమానపు మనిషి. జగదాంబ వీధిలోకి వెడితే అనుమానం. వొకరితో మాట్లాడితే అనుమానం. ఆ అనుమానమును మనస్సులో పెట్టుకుని, రోజూ యెద్దును బాదినట్లు బాదుతూ వుంటాడు...

ఆవేళ - అఫీసునుంచి వేగిరంగానే వచ్చేశాను. ఆ మరునాడు - రాజమండ్రి ప్రయాణం .. నేను స్నానంచేయటానికి పెరటిలోకి వెడుతున్నాను. మధ్యవాకిలి సరిహద్దులో రెండిళ్లవారికి మధ్యనుగోడలేదు.

ఆమె - వండుతూంది. నారాకను చూచిన జగదాంబను, 'మీ అయనలేరూ?' అని కండ్లతో ప్రశ్నించాను. లేరన్నట్లు బుర్రూపింది.

"నేను రేపుయుదయం బండిలో రాజమండ్రి వెడుతున్నాను..." మధ్యలో అగి, ఆమెతో అన్నాను! ఉచ్చైస్వరంలో-

"వెళుతున్నారా?..." సంతోషంతో వొక్కమారంది... "పిన్నిగార్ని అడిగానని చెప్పండే, మరువక త్వరలో నే వచ్చేయమనండి. ఆవిడ లేకపోతే నాకు చెయ్యి విరక్కొట్టుకున్నట్లుంది!-" అంది.

"అలాగే చెబుతా!-" నంటూ, స్నానం చేయటానికి పెరట్లోకి నిష్క్రమించాను...

(సశేషము)

గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారికి

# సానందసందేశము

అక్కరో సంతసమ్మొదవెనమ్మ సువర్ణపు కంకణమ్ము పెన్
న్మక్కువతోడ నేడు బుధమాన్యుఁడు కేసరి మీకొసంగె నన్
చక్కని పల్కువిన్న మిము శంకరుఁడో ముత సర్వకాలమున్
మిక్కుటమైన సంపదల, మీ సరసా కవితానురక్తులన్.

మన వనితాన్వయమ్మునకు మానిని! యెంతయు మీకతమ్మునన్
ఘనయశమబ్బె; మీకవనకామిని మోమున నేమిగద్దొ మే
మనయము ఆమెయేజగతియై బహుసంతస పెట్టుచుండగా
మనుదుము; నవ్యరీతి సుగమంబొనరించితి నీతిశాస్త్రిమున్.

ఏడుగురాడుపిల్లలు సఖిమణీ; ముగ్గురుపుత్రులంట; నీ
కేడ కవిత్వమల్ల తెరపించుక? వారల బుజ్జగించుచున్
కూడిడి, గుడ్డఁగట్టి, బడికో, గిడికో యటు బంపి, భర్తనో
నాడగరాని, యట్లు ఎటునాతి! పనుల్గయినేసి నేర్చితో?

ఉత్తమగృహిణి! మీకేలనుంచి స్వర్ణకంకణము కేసరి మనీషి గాంచె స్త్రీజ
నాభ్యుదయఘనయశము శుద్ధాంధ్రనారి! ధన్యతమమయ్యె మీజీవితమ్ము నేడు.

ప్రాణనాథ సంసేవనా భాగ్యమిద్ది; ప్రథమ జన్మంపునోముల ఫలమ ఇద్ది;
గిడుగు లక్ష్మికాంతమ్మక్క! కేల స్వర్ణకంకణము గీలుకొల్పి జగాన మనుము !!!

కేతవరపు ఇందిరాదేవి,






పి. వి. తాతాచారిగారు
ఐ. యస్. సి.

ఏవమ్మా! పిల్లలెందరు? అని అడిగింది నీలాటిరేవులో నీళ్లకోసంవచ్చి ఓ యిల్లాలు. దానికి జవాబుగా కంట తడిబెట్టింది సుశీల!

ఆనాడు పెద్దపండుగ. 'భోగిపండ్లు మా అబ్బాయికి పోస్తాం. పేరంటానికి రండి వదినగారూ!' అంటూ ఎందరెందరోవచ్చి పిలిచేరు. ఆ పిలుపువిని, 'గొడ్రాలా! నువ్వు రాబట్టే ముద్దుముచ్చట తీర్చుకోలేక పోతున్నాను. చూడు! ఆ అమ్మాయి రత్నం యెటువంటి అబ్బాయిని కందో! ముద్దుల మాట కడుతున్నాడు! ఆ పొరుగావిడచూడు! అవధాన్లగారి పెద్దమ్మాయి వసుమతిచూడు! ఆచార్లగారి పిల్ల సరస్వతిచూడు! గుమ్మిడిపండ్లలాంటి కుఱ్ఱాళ్లను మోసుకొచ్చేరు పుట్టింటికి. నా గ్రహచారం కొద్దీ నాకు కోడలవయావు' అని నోటికివచ్చిన మాటల నింకెన్నో అంది. దానికి, కన్నుల నీరునింపుకొని "పిల్లలు కలగక పోవడానికి నేనాకర్తను అత్తమ్మా!" అని విచారవదనంతో అనేది సుశీల!

ఆనాడు పండగకదూ! ఎక్కేగుమ్మం దిగేగుమ్మం. 'ఏమండీ! అక్కయ్యగారూ! ఎందరు పిల్లలు?' అని అడిగేది ఓ గృహిణి. 'పిల్లలు లేరమ్మా! అని చెప్పలేక చెప్పేది సుశీల. 'అప్పుడే ఆరేండ్లయ్యేయి కాపరానికివచ్చి ఇంకా పిల్లలులేరా!' అని అనేది ఓ యింట్లో పేరంటానికి వచ్చిన వారిలో యొకర్తె. ఆ మాటలు శూలంలాగ హృదయంలో గ్రుచ్చుకొనేవి పాపం! సుశీలకు. దాంతోపాటు బొటబొటమని కన్నీరు కంటికి మంటికి ధారగా కార్చేది. 'ఫరవాలేదమ్మా! పుడతారు. భగవంతుడియ్యాలి గాని మనలో యేముంది చూడు! మా అత్తగారి మేనత్తకూతురికి యిలాగే పదేళ్లయిందాకా పిల్లలు కలగలేదు. రెండేళ్లక్రిందటే ఓ శిశువును కంది.' అని ఓ యిల్లాలనేది. 'అయితే, నాకూ అలాగే పుడతారు కాబోలు!' అని తన మనస్సును సమాధాన పర్చుకొనేది ఆ అమాయకురాలు సుశీల.

ఈ విధంగా అందరి యిండ్లలోనూ యిదేమాట! పాపం! ఏంచెయ్యగలదు? సుశీల.

మాటిమాటికి యేదో సందు కల్పించుకొని రోజుకు అధమం వందసార్లయినా 'గొడ్రాలా! బాగ దాపరించేవు నాకొడుక్కి' అని యెకసారనేది. 'చూడు! నాకొడుక్కి మరోపెండ్లిచేస్తా' ననేది యింకోసారి సుశీల అత్తగారు. లాలించి పాలించి ప్రేమించి వీడు నా కొడుకనుకొని చంకనుంచుకొని ముద్దుముచ్చటలను చూస్తూ ఆనందించే 'పాపాయి తల్లి' కానప్పుడు సుశీల అత్తగారికి ఏం సమాధానం చెప్పగలదు?

'ఏమండీ! చూసారా! నలుగురు ఏమంటున్నారో నేను గొడ్రాలనట. మరి పిల్లలు పుట్టరట. గ్రహచారం కొద్దీ నాకు కోడలవయా వంటున్నారు అత్తగారు. దీనికి నేనా కర్తను? ఇది నాలోపమా? చెప్పండి! మీరయినా కాదని ఒక్కసారి నోరార నా ముఖంచూసి చెప్పండి!' అని కన్నీటి కాల్వలను ప్రవహింప జేస్తూ వలవల యేడ్చింది సుశీల భర్తదగ్గర. 'కాదు సుశీలా! నువ్వెలా అవుతావు? ఏడువకు. భగవంతు డనుగ్రహిస్తాడు. అందరికంటె మంచి అబ్బాయిని కంటావు.' అని ఓదార్చేడు సుశీలను.

పూర్వజన్మ సుకృత ఫలమో? లేక భగవంతుని కృపయో? అదీ కానియెడల భర్త ఆశీర్వాద ఫలితమో? కాని సుశీల యిప్పుడు అయిదు మాసాల గర్భిణి.

నేనూ ఓ పాపాయి తల్లినని చెప్పవచ్చునని గర్వించేది సుశీల! 'గొడ్రాలా' అని అత్తయ్య అంటే, కాదు. నేను గొడ్రాలను కాను. నాకూ ఓ అబ్బాయున్నాడు అని చెప్పవచ్చుననుకొనేది సుశీల! 'ఎందరు పిల్లలు?' అని యెవ్వరయినా ప్రశ్నిస్తే, 'ఓ అబ్బాయండీ!' అని గర్వంతో చెప్పవచ్చుననుకొని తన భవిష్యత్తును చూచి పరమానంద భరితురాలయ్యేది సుశీల!

మరి నాల్గుమాసాలు గడిచేయి. సుశీల నిండుచూలాలు. నేడో రేపో అందాలకు నిధియయిన అబ్బాయిని కంటుంది. ముచ్చటదీర ముద్దాడుతుంది. అందరిని పేరంటానికి పిలుస్తుంది. అని తనభావి భాగ్యాన్ని మరింత భాగ్యవంతంగా చేసుకొనేది సుశీల! ఏనాడూ లేని సంతోషం తెచ్చుకుంది. ఇంకేముంది? శిశువు బయటపడ్డాడు. సుశీల ఆనందానికి మేరలేదు. అత్తగారి సంతోషానికి తెంపులేదు. ఆ వీధిలో అందరూ చెప్పుకుంటున్నారు. ఏమని? "మన సుశీల ఓ మగశిశువును కందే!" అని.

పురిట్లో పెద్ద జబ్బుచేసింది సుశీలకు. బ్రతుకుతుందో లేదో అన్నట్లుంది. "కాను! నేను గొడ్రాలను కాను! నాచేతిలో ఓ పాపాయి వుంటే గొడ్రాల నెలా అవుతాను?" అని సుశీల పలవరించేది. "ఇన్నాళ్లవలె కాదు! మీ అందరిలాగ నేనూ ఓ పాపాయి తల్లినే! నా గొడ్రాలితనాన్ని నాపాపాయి పటాపంచలు చేసేడు! నన్నీదినంనుండి 'గొడ్రాలా!' అని పిలవకండి! 'పాపాయి తల్లీ!' అని పిలవండి! అని అనేది మధ్యమధ్య త్రుళ్లిపడిలేస్తూ సుశీల జ్వరంలో. జర్వం యెక్కువయింది.

పాపం! యిన్నాళ్లు తల్లికి పాపాయిలేదు! ఇప్పుడో కాలం తలక్రిందులయింది. పాపాయికి తల్లి లేదు!!!

# ఉమా తపస్సు



(గత సంచిక తరువాయి)

పలయుదర్భలు; యగ్నియు - జలముపూలు వేళకెయ్యేవిపలయునో - విసువుగొనక
యిచ్చుచుంటివె - యీశునకు - వెఱ్ఱిపడితి ప్రేత భూమికి కాపరి - ప్రీతిపడునె! -

పడతులు తాము గరుగలను తడయక నన్వేషణమ్ము - దగజేసినచో
జడిముడిపాటున - జనకులు తడయక "బోనాడుచుంట" తరుణీవిలవే!

వనితలరయ నెన్నైనను జనకులబోద్రోసి - పోని. సంతోషముతో
తనుకోరిన ప్రియులను - వేఘనముగ పెండ్లాడుటధిక - కౌతుకమెగదా!

తల్లిచాటున పిల్లలే - తమను తాము ఇష్టమైనట్టి వరుగోరి - యిర్వ్యాధిజన
జగములోపల యికముందు-సతులగతులు "తప్పద్రోవల త్రొక్కక తప్పనొక్క!

పత్ని వొక్కతెనైనచో - భయము లేదు శిరము నెక్కను నొక్కతె - చిన్నవాడే
యింకనీవాతనినె వరి - యింపతగునె? "రెండుకొప్పులు కలసియె - నెట్లుండు! నతివ"

ఎందరెందరో సుందరు - లుండరవని వారలందరు నీకండ్ల - పడగలేదే?
వల్లకాటికి కాపరి - వలనుజిక్కి కోరయుక్తమె? బేలవై - "కోమలాంగి"

ఘనతర వంశమందున యాగారముతోడుత నీదు పెద్దలున్
బెనుపగ కాదు పొమ్మనుచు బిద్దగ తాపస వృత్తి చేతగన్
కొనగొనినంద బోల్పుఫల కోరకమింకను వృద్ధిగాము - నీ
కనుకొను యీశుడేమియిడు. అంబుజనేత్రిరో! వల్లకాటిలోన్.

అనుచుపల్కిన పల్కుల - నాలకించి పడతిపార్వతి యిట్లని - పలికె - వాని
మదినిగల్గిన సందియాల్ - మాటుమణిగే పత్నినొకర్తి పల్కనే - "బ్రహ్మయేని"

రాముతోడుత వనికితా - రమణిసీత వత్తునన్న బొవ్వనెంట - వలదటన్న
మాటలన్నిటి బోద్రోసి - మగనితోడ అడవికే తేరి నిర్మల - ఖ్యాతిగనదె -

నీవుకాదన్న మాత్రాన - నీలకంఠు నీ డెట్టియొగ్గును సెందదు ఏపుమీర
ఇప్పుడన్నట్టి మాటల నొప్పిగొంటి వల్లకాదిక నిటనుండ వెళ్లుమయ్యా -

వానిగాకున్న బెండ్లియేపలదు; కాని వానిదూషింప తగదింక పడతినంచు
ఎంతువేమొకొ నాచెలు లింతలోన వత్తురిటకయ్యవారుని నృనుతురయ్యా -

పరులదూషించుటెంతయు పాపమంచు పల్కుచుండుట వినవొక్కొ పాపివైతి
సర్వమీశుని కొఱకయి జతనపఱచి ఎదురుచూచుచునుంటివే యీశుగోరి -

వాసము వల్లకాడనియు వాంఛితమెల్లను తీర్పడంచు; నీ
మోసపు మాటలేల ప్రజముక్కను వేల్పునె; యెంచునెప్డు లో;
దోసమువాని రూపగుణ దూషణసేయగ నెవ్వరేని; మున్
వాసిగ వాని గొల్చిక్షితి వాంఛితమందరె? దేవదానవుల్.

పతియేదైవము సతులకు పతియేగతి ధరణిలోన భావము పోల్కన్
సతిమాటలు పతిమాటలు గతితప్పకయున్నయడ్డె; గాంతువు ఖ్యాతిన్.

శంకరునెప్పుడు నిర్గుణు సంకటముల ద్రుంచినన్ను సాకుము శూలీ
శంకలు విడనాడిన "శంభో శంకర యంచాత్మ గొల్చె సర్వేశు మృడున్.

మీఱకు యింకపైని నునుమోసపువాడియు; దేహపాటవ
మ్మేరికి వాంఛ గొల్పుదురు మృత్యువిజేతయు; సృష్టికర్త తా
నేరిక; భూనభోంతరము లోకములొంతెరి; నుండువాడు స
త్కారణ జన్మడాతడని కారణదృష్టి యెఱుంగనైతివే.

అంచునేకాగ్రచిత్తయై యతివబలుక గడగడవడంకు చీకుదు గద్గదమున:
పలికెనీరీతి సంబికా! బాగుబాగు ఫలముజేచిక్కె నైగొమ్ము సలలితముగ.

ఏవియేవియొ బల్కితి నింతదనుక అంచితంబుగవాని సైరించిమించి
హావభావవిలాసినీ కావుమింత శీధుశీకరసిక్తమూ చేయినొసగి.

అనుచుభర్గుడు తనరూపు యప్పుడపుడ నిశ్చయాత్మకబుద్ధితో నెలతయెదుట;
కనులకానందమొదవగా గాంచజూపి దనరమామెను జేపట్టి ధన్యుడాయె.

పలుకునర్థముజేరతి వదలకుండు పరిమళమ్మును పుష్పముల్ బాయనిగతి
యటుల నొండొంటనుండిరి చటులప్రేమ కాంతవిడకుండెవావిధి. "కాలకంఠు"

ఉవిదరొ "ఉమేతి" నీతల్లి యుస్సురంచు తపమువలదన్న కాదనిపడయుకుండ
నన్నుగోరుట యుక్తమే "సన్నుతాంగి" నిజమనోభీష్టసంసిద్ధి నిర్ణయించి.

ఇదిపఠియించిన వినినను పది జన్మంబులకు ముందు పడిజన్మలపై
నెదదలచిన పనులగు తుదికైవల్యంబుపొసగు దోసములడగున్.

"వైదేహి"

# సంపూర్ణజీవనానికి సాధనములు - "ప్రేమ"



శ్రీమతి నెములి చంద్రమతీదేవిగారు.

ప్రేమయనగా అసలు అర్థం చేసుకొనుటయే కష్టసాధ్యం. ప్రేమయనగా నేమిటి? ఆత్మాకర్షణ యనవచ్చును. ఒకఆత్మను మరియొకఆత్మ ఆకర్షించుట. మనప్రేమ, ఎన్నో విధములుగ తోచును. దైవప్రేమ, తల్లిదండ్రులయందు ప్రేమ, తోబుట్టువులయందుప్రేమ, భార్యభర్తలప్రేమ, బిడ్డలయందు ప్రేమ, స్నేహితులయందుప్రేమ, పెంపుడు జంతువులయందుప్రేమ, ఇన్నివిధముల ప్రేమయంతయునొకటే.

ప్రేమమయుడగు, భగవంతునినుండి, సదాసర్వకాలము, తన బిడ్డలయందు ప్రసరింపజేయు వాత్సల్యమే ప్రేమ. విశ్వప్రేమే దైవము; దైవమే ప్రేమ.

దేవుడు ప్రేమస్వరూపియై, తనలోనుండు ప్రేమస్వభావమునే, మనుష్యునిలో సృజించియున్నాడు. మనుష్యులు, తమకు ఆత్మ, మనస్సు, ప్రేమ, తెలివినిచ్చిన భగవంతుని, ప్రేమించుటముఖ్యము. మఱియు ఆయనసృజించిన వారినికూడా ఆయనపేర ప్రేమించవలసినదే. అలాగునమానవుడు, తనలో ప్రేమను సృష్టించిన సృష్టికర్తను, సంపూర్ణహృదయముతోను, మనస్సులోను, ఆత్మలోను ప్రేమించనియెడల స్వప్రీతిపరుడగును. అప్పుడుతనకు, తాను నాశనము చేసుకొనుటయేగాక, ఇతరజీవులకు నాశనముకలిగించును.

స్వప్రీతిపరుడైన ప్రతిమానవుడును, నిజముగ ఆత్మహత్య చేసుకొనుచున్నాడన వచ్చును. ప్రతియొక్కమనుష్యుడు సకలజనులను సోదరభావముతో జాతి, మత బేధములులేక ప్రేమించినయెడల, ప్రపంచములో యుద్ధములన్న మాటయేలేక, సర్వశాంతి యుతముగ, నుండదా?

"మనవలె ఇతరులను ప్రేమించ" వలెనని మహాప్రవక్తలు చెప్పియున్నారు. తనతో రెండు మూడురోజులుమాత్రమే వసించు, పరాయివారియెడల, వారుశత్రువులైనను, దయగానుండుట, సులువే, కాని మనసమీపమున నివసించుచు, మనకుయెడతెగని, తొందర కలిగించువారిని, సహించి మనవలె వారిని ప్రేమించుటనిజముగా అతికష్టమైనసంగతి. ఈగొప్పయుద్ధములో మనము జయమొందిన యెడల ఇతరులనందరిని మనవలె ప్రేమించుట సులభము.

ఒకడు తన పూర్ణహృదయముతోను, మనసుతోను, ఆత్మతోను, దేవుని ప్రేమించి, తనవలె, తన పొరుగువానిని, ప్రేమించినటువంటివాని మనసులో, సందేహములకు చోటుండదు. అప్పుడు వాడు ప్రేమయను అగ్నిలోకరిగి మొదట ఎవరిస్వరూపమందు, సృజింపబడెనో, ఆపరమపురుషుని పోలికకు సమరూపముగ, రూపాంతరము పొందును.

ప్రేమయుండిన సందేహముండదు. ప్రేమవల్ల నమ్మకము, నమ్మకమువల్ల ప్రేమయుకలుగును. ఆపరమదయాళుడు సృజించిన, మన తల్లిదండ్రులయందు, ప్రేమ, దృఢవిశ్వాసములు కలిగియున్నట్లు, ఆయనయందుకూడా, ప్రేమ, భక్తివిశ్వాసములు కలిగియుండవలెను. మనతల్లిదండ్రులు మనలను, మోసగించెదరని, సందేహించెదమా? ఎట్టిసందేహములేక నమ్మెదము. అలాగునే, సర్వాంతర్యామియైన, సర్వవ్యాపియైన సర్వసృష్టికర్తయైన, ఆ నిర్గుణపరబ్రహ్మమును కూడా, దృఢవిశ్వాసము కలిగిప్రేమించ వలెను.

రాధాకృష్ణులప్రేమే, ప్రకృతిపురుషులప్రేమ. కృష్ణుడేపరమాత్మ; రాధేమూలప్రకృతి; పరాశక్తి. భగవంతుని యిచ్ఛే ప్రకృతిశక్తి. తనయొక్క ప్రతిబింబమే. ప్రకృతి. ప్రకృతిలేక పరమపురుషుడుండడు, పరమాత్మలేక ప్రకృతిలేదు. ఒకటివిడచి ఒకటియుండదు. రెండునుఏకమే, సమమే.

గోపికలు అత్యంతప్రేమ భక్తులతో కృష్ణునారాధించి, ముక్తిపొందిరి.

భగవానుడు నరరూపమెత్తి, నరులకు ప్రత్యక్షముగ, చూపినగాని అర్థముచేసుకొనలేరు. నిర్గుణ బ్రహ్మమును చూచుటకు, మానవుడు, నిర్గుణుడు కావలెను. సహజ మానవ మానసముల కందని, ఆమహాను భావునిమహిమ, ఏమని చెప్పగలము.

ప్రతియొక్క స్త్రీ, తనభర్తను, భగవంతునిగను, కృష్ణస్వరూపునిగనూ, ప్రతిభర్తయు తనభార్యను తనస్వరూపమేననియు, తనప్రతిబింబమేగనుక, తనకు సరిసమానమేనని, భావించి, ప్రేమించవలెను. తుచ్ఛమైన శరీరసంబంధమైన ప్రేమ, ప్రేమగాదు. అదివట్టి పశుసంబంధమైన ప్రేమగాని, మానవప్రేమగాదు. కేవలము సృష్టివిస్తరణకై మాత్రము నియోగింపబడినది.

విశ్వమునంతటిని, ఆవిశ్వనాయకుని, ప్రేమించువారే సర్వసంపూర్ణజీవులు.

---

# రాధిక

పవలు, రేయని యెరుగక, భావమందు, నీదు మోహనమూర్తిని, నియతిదాల్చి
అంత, మేలేనికోరిక, లౌసగొలుప, నిలిపితిని మేన ప్రాణము, నిర్మలాత్మ!

మంద పవనంబు వీచి నా డెందమందు విరహ, గిజదరిగొల్పినన్ వేదపరిచె
కమ్మ, కస్తురితావులు గ్రుమ్మరించి, కలత పరచెను సుమతతి, కరుణమాలి.

రమ్యమగు యీ శరద్రాత్రి రమణనీదు సజ్జ, చేరి సుఖంబును బడయలేని
పరమ దౌర్భాగ్య వతినైతి, ప్రాణసఖుడ, ఇంత, కఠినుండ వంచు నే నెరుగనైతి.

మధుర, నాదములొలుకు నా హృదయ వీణ సారె సవరించి, విసివివేసారెపోతి!
పలుకదయ్యెను తొల్లింటి, భావగీతి మూగవోయెను నేడేమొ, మోహనాంగ!'

దోసమేదైన నాయందు పొసగెనేమొ, అంతమాత్రాన యింతటి అలుకతగునె
తప్పుక్షమియించి కాచుటయె వీలుగాదె, కానుపింపవు నాపైన కరుణ లేదె?

మధుర, ప్రణయైకబోధిత, మృదులగాన సుధల చిలికించురాగాలు, సొగసులొలుక,
పిల్లనగ్రోవి మ్రోయింప జల్లుమనుచు నాదు హృదయంబు జీవన నాథనిజము.

రాధతోడిదె లోకంబు, మాధవునకు నిర్మలానంద సంధాన నిరుపమాన
భవ్యప్రేమైక, విధులను పలుకులెల్ల, రిత్తయయ్యెనుగద నేడు సత్యముగను!

నాథ యీదుర్భర, విషాద నాటకమున, అభినయింపగ జాలను, ఆశలుడిగి
ఘోర, గంభీర, తరంగ ఘోషణమున అసువులను విడచుటే నాకు అవధియయ్యె!

చుండూరి రమాదేవి.

---

# లోకవార్తలు

జమాలో పాదరక్షలు దొంగిలించిన ఒక యువకునికి మెడలో పాదరక్షలహారము వేసి ఊరంతా తిప్పిరి. అల్లరిపిల్ల లనేకులు అతని వెంటబడి గేలిచేయుచుండిరి. స్థానిక దేవాలయములలో చెప్పులు దొంగిలించుట అలవాటుపడియుండిన ఈ యువకుడు ఒక సిక్కు గురుద్వారంలో చెప్పులు దొంగిలించుచుండగా గురుద్వారం అర్చకులు అతనిని పట్టుకొని పోలీసులకు వప్పచెప్పకుండా ప్రాయశ్చిత్తార్థము ఈ శిక్ష విధించిరి.

♦ ♦ ♦

కలకత్తా ఆసుపత్రిలో 15 ఏండ్ల బెంగాలీబాలిక, రెండుతలలు, మూడు చేతులు, నాల్గు కాళ్లుకల వికృత మృత శిశువును ప్రసవించెను. "ఇది కవలు జన్మించ దగిన సందర్భమని తలపవచ్చును. కాని రెండు పిండములవక్షస్థలములు ఏకమగుట చేత, అది రెండు తలలు, నాల్గుకాళ్లుగల వికృతరూపమున జనించినది" అని డా॥ మిశ్రా గారు చెప్పిరి. తల్లి క్షేమము గానున్నది.

♦ ♦ ♦

ఇండోరు సమీపంలో నెలకొల్పబడిన కస్తూరిబా గ్రామానికి కస్తూరిబా నేషనల్ మెమోరియల్ ఫండు సెంట్రల్ ఆఫీసు ఈ మే 1 తేదిన మార్చబడినది. అక్కడనే అది శాశ్వతంగా ఉంటుంది. ఇక్కడ కేశసేవికులకు మంత్రసానిపని, బేసిక్ విద్యా విధానము, మున్నగు వానిలో తర్ఫీదు ఇవ్వబడును. ఈ గ్రామం క్రొత్తగా కట్టుతున్నారు. ఇప్పటికి 3 లక్షలు ఖర్చైంది. 20 లక్షలకుపైన అవుతుందట. పూర్తిగాను 5 సం॥లు పట్టుతుందట.

♦ ♦ ♦

సార్వభౌమ సాధుమండలి యాజమాన్యాన ఢిల్లీలో సాధువుల మహాసభ గతమాసాంతంలో జరిగినది. ప్రపంచంలో శాంతి స్థాపన వీరి సంకల్పమట. అందుకు కార్యక్రమం నిర్ణయించారట. భారతదేశం సాంఘిక రాజకీయ జీవితాన్ని పావనంచేయడంకూడా వీరి ఆశయం. ఇది ప్రపంచసంస్థ. జర్మనీ, టిబెట్, ఇండోనేసియాలనుండి 6 గురు సన్యాసులు ఈ సభకు వచ్చారు. అధ్యక్షుడు శ్రీ స్వామీ శాంతానందజీ మహారాజు గారు; 60 సం॥ల వృద్ధు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఈయన బర్మాలో ఇంజనీరుగా ఉండేవాడట.

♦ ♦ ♦

ఇంగ్లాండు మాజీవిదేశాంగమంత్రి బెవిన్ చనిపోయినాడు. ఇతను పుట్టకముందే, ఇతని తండ్రి, ఒక పొలంలో కమతగాడు, చనిపోయినాడు; పుట్టిన నాలుగేండ్లకు తల్లి చనిపోయింది. పినతల్లివద్ద పెరిగాడు.

పొలంలో పనిచేసి, హోటలులో చిప్పలుకడిగి, లారీ డ్రైవరుగానుండి కార్మికోద్యమంలో బాగా కృషిచేసి పైకివచ్చి మంత్రి అయినాడు. చిన్న చదువే చదివినా అనుభవంమీద కార్మికులవాదాన్ని బారిస్టరులాగా అధికార్ల ఎదుట వివరింపగలిగేవాడట. గతయుద్ధంలో బ్రిటిష్‌దీవులలోగల జనాభాలో సగానికిపైగా యుద్ధపు పనులకు పెంగ్గించారట.

♦ ♦ ♦

పూర్వం తురకలదాడిలో ధ్వంసమైన సోమనాథ దేవాలయాన్కి జీర్ణోద్ధరణం జరుగుతున్నది. 7½

అడుగులఎత్తు నల్లరాతి శివలింగం ప్రతిష్ఠింపబడినది. మే 10 న రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ బాబూ రాజేంద్ర ప్రసాద్ గారు శివలింగ ప్రతిష్ఠ చేశారు.

◆ ◆ ◆

1943 నేతాజీ సింగపూరులో ఒక వెండి రాట్నాన్ని లక్షరూపాయలకు వేలం వేశారు; ఆయన ప్రత్యేకంగా ఒక త్రివర్ణపతాకం ఉపయోగించేవాడు. ఇవి ప్రధాని నెహ్రూవద్దకు చేరాయి. వీనిని ఆయన ఢిల్లీలో ప్రభుత్వభవనమందలి చిత్రవస్తు ప్రదర్శనశాల కిచ్చినారు.

◆ ◆ ◆

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి మంత్రివర్గపక్షాన సంజీవరెడ్డిగారు, వ్యతిరేకపక్షాన ఆచార్య రంగాగారు పోటీచేశారు. 5 ఓట్ల మెజారిటితో సంజీవరెడ్డిగారు గెలిచారు. రంగాగారు, వారికి సహాయపడ్డ ప్రకాశంపంతులుగారు కాంగ్రెసును వదిలేసి ప్రజాపక్షం అని క్రొత్త పార్టీ పెట్టినారు. ప్రకాశంగారి కాంగ్రెసు డెమాక్రటిక్ ఫ్రంట్‌న్ను, రంగాగారి కిసాన్ మజ్దూర్ పార్టీనూ కూడా ఇందులో కలిశాయట.

◆ ◆ ◆

యథాప్రకారం భద్రాచలంలో ఈ శ్రీరామనవమికి శ్రీ సీతారాముల కళ్యాణ మహోత్సవం వైభవంగా జరిగినది. 50 వేల దాకా యాత్రికులు వచ్చారు. తగిన యేర్పాట్లులేక యాత్రికులు కష్టపడ్డారట. కలరా వ్యాధివలన కొందరు చనిపోయినారట.

◆ ◆ ◆

వింధ్యప్రదేశ్‌లోని రీవాయందు ఇటీవల సహాగమన మొకటి జరిగెను. దానిని నివారించుటకు పోలీసులు ప్రయత్నించగా వారికిని నాలుగు వందల మందిగల సమూహమునకును జరిగిన సంఘర్షణలో యిద్దరు పోలీసులు, గుంపులోనివారు యిద్దరు చనిపోయిరి. పోలీసులకు తీవ్రగాయములు తగిలినవి.

◆ ◆ ◆

ఏప్రియలు నెల 30 వ తేదిన విజయవాడలో జరిగిన ప్రజాపార్టీ సమావేశంలో శ్రీటంగుటూరి ప్రకాశం గారిని నాయకుడుగాను, శ్రీకోమ్మారెడ్డి సూర్యనారాయణగారిని కార్యదర్శిగాను ఎన్నుకొని, యీ నెలాఖరులోపల ప్రజాపార్టీకి సంబంధించిన జిల్లా, తాలూకా సంఘములు ఏర్పాటుచేయ నిశ్చయించబడెను. ఇప్పటికే 41 మంది రాష్ట్ర కాంగ్రెస్ సభ్యత్వమునకు రాజీనామా యిచ్చి ప్రజాపార్టీలో చేరిరి. ఇంకా 20 మంది వారి ననుసరించగలరట.

◆ ◆ ◆

రివిన్యూ బోర్డువారు ఏప్రియలు 29 తేదీన జారీ చేసిన ఉత్తర్వు ప్రకారం రేషన్ ప్రమాణం ఎప్పటి 7 ఔన్సుల స్థితికి వచ్చింది; కాని వెంటనే ప్రభుత్వము వారు తొలయిన మార్పు ఉత్తర్వును రద్దుపరచుచు, క్రొత్త ఉత్తరువు క్రింద రేషనులు తీసుకొన్నవారికి తగ్గించిన రేషనును ముదరా యిచ్చునట్లు ప్రకటించిరి.

◆ ◆ ◆

వయోజన ఓటింగు పద్ధతిననుసరించి ప్రప్రథమముగా జరిగిన హైదరాబాదు మునిసిపాలిటి ఎన్నికలలో తొలిమేయరుగా "ఆంధ్ర పితామహు" శ్రీమాడపాటి హనుమంతరావుగారు ఎన్నుకొనబడిరి.

◆ ◆ ◆

గత రెండు సంవత్సరములలోను ఇండియా నుండి 10,66,00,000 గజముల చేనేత గుడ్డ విదేశములకు ఎగుమతి చేయబడింది.

◆ ◆ ◆

సర్వోదయ ప్రణాళికను కాంగ్రెసు అంగీకరించినట్లయితే సోషలిస్టుపార్టీ రద్దుచేసి తామందరూ కాంగ్రెసులో తిరిగి చేరగలమని శ్రీజయప్రకాష్ నారాయణగారన్నారు

◆ ◆ ◆

కాశ్మీరు సంస్థానమునకు రాజ్యాంగచట్టము తయారు చేసేనిమిత్తం రాజ్యాంగ పరిషత్తును వెంటనే నిర్మించవలసినదిగా యువరాజు కిరణ్ సింగుగారు ప్రకటించిరి.

◆ ◆ ◆

సౌరాష్ట్రంలోని పోర్ బందరులోనున్న సుధామ దేవాలయంలో వందలాది ప్రజలు 0-5-3 చెల్లించి

స్వర్గానికి టిక్కెట్లు కొనుక్కోడానికి పడి యుంటారట. దేవాలయానికి సమీపములోనున్న సొరంగం గుండా అవతలికి పోగలిగినవారి పాపాలన్ని పటాపంచలయి ముక్తి లభిస్తుందని ఆప్రాంత్యపు వారికి నమ్మకం. ఆదేవాలయపు పూజారి ఒక్కొక్కరిదగ్గర 0-5-3 వసూలుచేసి కుంకుమబొట్లుపెట్టి సొరంగములోనికి ప్రవేశము యిస్తున్నాడట.

◆ ◆ ◆

చైనానుండి ఇండియాకు అదనంగా 50000 టన్నుల బియ్యం ఎగుమతి యయ్యేటట్టు చెయ్యడానికి ప్రస్తుతం పీకింగులో రాయభారాలు జరుగుచున్నవని వార్త.

◆ ◆ ◆

కేంద్ర ఆహారశాఖామంత్రి శ్రీ కె. యమ్. మున్షీగారు బర్మానుండి తిరిగి రాగానే 12 ఔన్సుల రేషను యిచ్చుటకు ప్రయత్నించెదమని మద్రాసు ఆహారమంత్రి శ్రీ విక్టోరియాగారు పత్రికా ప్రతినిధులతో చెప్పిరి.

◆ ◆ ◆

విశ్వభారతిబిల్లు మేనెల 3-వ తేదినాడు ఇండియా పార్లమెంటువారిచే ఆమోదించబడెను. దానికి గ్రాంటును 175000 రూపాయలనుండి 450000 రూపాయలకు హెచ్చించు భారత ప్రభుత్వ సూచనను ఆర్థిక సంఘమువారు ఆమోదించిరి. విద్యార్థులకు ఎక్కువ వసతి గృహములు నిర్మించుటకును, ఉపాధ్యాయులకు నివాసగృహములు నిర్మించుటకును, అయిదు లక్షల రూపాయలు యిచ్చుటకు ఆమోదించియున్నారు.

◆ ◆ ◆

కోలార్ గోల్డ్ పోలీసు స్టేషను ప్రాంతములో ఆరుగురితోకూడిన ఒక కుటుంబము తినుటకు తిండి దొరకని పరిస్థితులలో ఊక (వరిపొట్టు)తో రొట్టెలు చేసికొని తిన్నారట. అవి తినిన కొద్ది కాలమునకే ఒకడు మరణించాడట. అతని శవాన్ని భాగల్పూరుకు పరీక్షార్థమై తీసికొనివచ్చారు. మిగిలిన ఐదుగురికి పిచ్చిపట్టిందట.

అంతర్జాతీయ కథానికలపోటీకి భారతదేశం తరఫున పంపదగిన ఉత్తమతెలుగు కథలను ఎన్నుకునే నిమిత్తమై హిందుస్థాన్ టైమ్సు పత్రిక నిర్వహించిన పోటీలో శ్రీపాలగుమ్మి పద్మరాజుగారి "గాలివాన" (తెలుగు) కథ రెండవదిగా నెగ్గినది. అందుకుగాను శ్రీరాజుగారికి 1000 రు బహుమానంగా నివ్వబడును.

◆ ◆ ◆

నేడు బ్రిటనులో 72,760,000 మంది స్త్రీలు ఉద్యోగాలలో నున్నారట. ఈరేటున మరికొంత కాలంగడిస్తే బ్రిటను దేశపు స్త్రీ జనాభాలో సగంమంది ఉద్యోగస్థు లనిపించుకొంటారు.

◆ ◆ ◆

1950 సంవత్సరము నవంబరు నెలకు అమెరికా దేశపు బంగారము విలువ 2300 కోట్ల డాలర్లు. అంతకు క్రితం సంవత్సరం 2450 కోట్ల డాలర్లు.



—(:o:)—

# నివేదన

వలపులు గ్రుమ్మరించు రసవన్మధు పాత్రప్రియంబుమీర ని
ర్మలమతితోడ తెచ్చితిని, రమ్ము గ్రహింపుము, ఆలసించిన౯
అళులు గ్రసించునో ధరణి నైక్యతఁ జెందునో చెప్పఁజాల - కో
మలసుకుమార పుష్ప మధుమంజులమియ్యది అందుకో “ప్రభూ”

కరతలమల్లలాడె, కసుగందెశరీరము, మోమువాడె, - సుం
దరసుకుమారమూర్తి! రసతన్మయత౯ హృదయంబదేటికో
పరవశ మొందుచున్నయది, పల్కుటకైనను మాటరాదు - నా
కరయఁగరాని బాధ నిటులందగఁజేసితి వేటికో “ప్రభూ”

వచ్చుచున్న సూర్యభగవాను కరమ్ములుసోకి, మెల్లగా
విచ్చుసువాసనల్ విరియవెల్గెడునట్టి నవారవిందముల్
తెచ్చితి పుష్పమాలికల తీయనికోరికతోడ గ్రుచ్చి - నీ
కిచ్చి ముదంబునొందెద గ్రహింపుమిదే తుదివాంఛగా “ప్రభూ”

వలపు వెన్నెలద్రావిన - వయసుతొడద కాలగతి సోలివెలుగను - కోలుపోయి
క్రుళ్ళి కృశియించికృశియించి కుమిలికుమిలి నాశమగుటనుజూడవు న్యాయమగునె.

లలితసుకుమార మంజుల వలిపములను బాలకోమలఁ మల్లెపూ - మాలికలను
వానికన్ననుమిన్నయౌ - వలపుహృదిని దాచియుంచితి ప్రేమతో - దాల్తువనుచు,
తాల్పకున్నను మానెనో - ధవళనేత్ర” శశినఁదాశించు నీశుభా - స్యంబు నొక్క
సారిచూపించి పోవోయి - చాలునదియె అన్యవరముల వేడ నా కాశలేదు
దీనురాలను తుదికాంక్ష - దీర్పవోయి.

డి. సరస్వతి.




మధ్య ప్రదేశ్ హోంమంత్రి శ్రీ డి. పి. మిశ్రా సంస్కృతాధ్యాపకుల మహా సభను ప్రారంభించుచు జబ్బల్ పురంలో ఇట్లని హెచ్చరించిరి:-

ఇప్పటికిని సంస్కృతము ప్రపంచ వాఙ్మయములో విశిష్టమైన స్థానమును ఆక్రమించుకొనియున్నది. ఆవాఙ్మయము పోయినన్ని కొత్త పోకడలు ప్రపంచములో చాలా భాషలు పోయి వుండలేదు. అదియును గాక ఈభాషకు భారత దేశంలో అతి విశిష్టమైన ప్రాముఖ్యత వున్నది. భారత జాత్యైకతకు, అది కారణము.

ఈసభకు అధ్యక్షత వహించిన ప్రొఫెసర్ చతుర్వేది సంస్కృత భాషావ్యాప్తికిగాను రాష్ట్ర ప్రభుత్వములు చేయుచున్న కృషిని ఉగ్గడించుచూ, సంస్కృతము దేశభాషలన్నిటికి తల్లిభాష, అధునాతన భారత వాఙ్మయాభివృద్ధి ఈభాషను పోషించుట మీదనే ఆధారపడి యున్నదనిరి.

ఇండియాప్రధాని పండితనెహ్రూ బులాంద్షార్ లో ఏప్రియలు 28 వ తేదిన కాంగ్రెసు సేవికల సమావేశములో నుపన్యసించుచు యిట్లుచెప్పెను:

"ఒక దేశంయొక్క పురోగమనాన్నీ, అభివృద్ధిన్నీ ఆ దేశంలో స్త్రీ స్థాయినిబట్టి చెప్పవచ్చును. ఇచ్చట యింకా స్త్రీలు పర్దాను పాటిస్తుండటం చూస్తే నాకు ఆశ్చర్యకరంగా నున్నది. ఈ పర్దా దేశంలో ఎన్నడో అంతర్ధానమై పోయిందని అనుకొన్నాను. పురుషులతో సమానంగా నిర్మాణాత్మకమైన కృషిలో పాల్గొని ప్రజాసేవ చేయాలి"

విశ్వభారతి విశ్వవిద్యాలయ చట్టము ఇండియా పార్లమెంటులో ఆమోదించ బడిన సందర్భమున, యీవిశ్వ విద్యాలయమునకు ప్రస్తుతము చాన్సెలర్ గా వ్యవహరింప నున్న పండిత నెహ్రూగారు యిట్లుచెప్పిరి :

ఈవిశ్వ విద్యాలయము యితర విశ్వ విద్యాలయముల పద్ధతినే అంధప్రాయముగా ననుసరింపకూడదు. విద్యాశాఖాధి కారులుకూడ ఆ విద్యాపీఠము దాని విశిష్టమార్గమునే అనుసరించునట్లుగా అవకాశ మొసంగెదరు.

భారత ప్రభుత్వాధికారులు స్త్రీలు రక్షణశాఖలలో చేరుట కర్హులా? కారా? అను విషయమై యీక్రింది విధముగా ప్రకటించిరి:

రక్షణశాఖల యందలి సివిల్ సర్వీసులలో ఉద్యోగములు చేయుటకు స్త్రీలు అర్హులు; సైనికులుగా పనిచేయుటకు మాత్రము వారు అనర్హులు. ఉద్యోగము లిచ్చుటలో లింగ విచక్షణయుండరాదని రాజ్యాంగ విధానము నిర్దేశించుచుండుటచేత సివిల్ ఉద్యోగములన్నిటిలోను స్త్రీలను చేర్చుకొనుట భారత ప్రభుత్వ విధానమైయున్నది.

# మంచి చెడ్డలు

శ్రీమతి ఉప్పులూరి వెంకటసత్యవతిగారు

నారాయణ రావుగారు తాలూకా ఆఫీసులో హెడ్ ఎకౌంటెంటు. వీరికి యిద్దరు మొగపిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు. భార్యపేరు పద్మావతి. ఈవిడ మంచి రూపసి. అత్తలేని కోడలు ఉత్తమురాలు, కోడలు లేని అత్త గుణవంతురాలు - అని మనపెద్దలు అన్నట్లుగా ప్రస్తుతము పద్మావతమ్మగారు గుణవంతురాలనే చెప్పవచ్చును. వారి పెద్ద కుమారుని పేరు బుద్ధీశ్వరరావు. రెండవవాడి పేరు శ్రీధర్. పెద్దవాడు బి. ఎ. చదువుతుండగా జోగారావుగారనే High School Headmaster గారి చిన్న కూతుర్ని యిచ్చి పెండ్లి చేసినారు. ఈమె పేరు సుశీల. చామనచాయ రంగు. కొద్దిగా చదువు, సంగీతము వచ్చును. రూపసికాదు, అనాకారికాదు. సామాన్యంగా వుండేది. అసలు ఈ సంబంధం చేసికోవటం పద్మావతమ్మగారికి యిష్టమేలేదు. ఇదంతా వియ్యంకులకున్నటువంటి బాల్యస్నేహాన్నిబట్టి జరిగిన సంబంధం. పాపం నారాయణరావుగారు ఈ రోజులలోమాదిరిగా కట్నము, చదువూ, అందమూ చూచుకోలేదు. పూర్వపు రోజులలో మాదిరిగా సాంప్రదాయకమైన కుటుంబమనీ, పిల్ల బుద్ధిమంతురాలని చేసికున్నారు. కొన్నాళ్లకు సుశీల కాపరానికి వచ్చింది. పాపం ఈమె చాలా అమాయకురాలు. అత్తగారికి ఈవిడంటేనే గిట్టేదికాదు. ఏపనిచేసినా పనికి వచ్చేదికాదు. తనలాగా తెల్లగా లేదని, తెలివిగలది కాదని విసుక్కుంటూ వుండేది. ఎవరైనా మీ కోడలు ఏదమ్మ అని అడిగితే "అదిగో, మా ఏనాది" అని అంటూ వుండేది. ఒక రోజున యీ అమ్మాయి బిందెతో నీళ్లుతెస్తుండగా చెయ్యిజారి బిందె పడి సొట్టపడింది. అత్తగారు బిందె సొట్టపోయిందని దిగులుపడిందే గాని, పాపం అమాయకురాలైన సుశీల బొటనవ్రేలు చితికి నెత్తురు కారుతుంటే చూడనైనా చూడకుండా రివ్వున ఆ బిందె తీసికొని వెళ్లింది.

ఇది యిట్లావుండగా శ్రీధర్‌కు కూడా పెళ్లి అయింది. ఆ అమ్మాయి పేరు మోహిని. ఆమె, తండ్రికి ఒక్కతే ఆడపిల్ల. అందుకని చాలా గారాబంగా పెరిగింది. ఈమె చక్కనిది. చదువుకున్నది. ఒదినగారిమీద తనతల్లి విసుక్కోవటం చూచి, శ్రీధర్ తన భార్య వచ్చిన తర్వాత తల్లికి అడుక్కు మడుగులొత్తిస్తానని అంటుండేవాడు. మోహినికూడా కాపరానికి వచ్చింది. అతి సుకుమారి. పుట్టినయింట గారాబముగా పెరిగిన వలన మెట్టిన యింట పనిపాటలు చేయలేక పోవుచున్నది. అస్తమానమూ నీటుగా వుండటమూ, క్లబ్బులకు వెళ్ళటమూ, సినిమాలకు వెళ్లటము బాగా చేతనవును. ఈ విధంగా వున్నా అత్తగారికి చిన్న కోడలుమీద ఎక్కువ మమత. చదువుకున్న పిల్ల అని, సుకుమారి అని, ఏమీ అనేదికాదు. పాపం, శ్రీధర్‌కు కూడా అదే భయము. తల్లికి అడుగుకి మడుగులు వొత్తించకపోగా దవడలు రెండూ ఒత్తించినాడు.

ఇట్లా వుండగా మండు వేసవికాలము వచ్చింది. పద్మావతమ్మగారు ప్రసవించినది. ఇంట్లో అందరికి జ్వరాలు పట్టుకున్నవి. ఇంటి చాకిరి అంతా అమాయకురాలైన సుశీల మీద పడింది. మోహిని, యింట్లో ఈ విధంగా వుండటం చూచి ఒక Plan వన్నింది. నాకిక్కడ ఎండలు ఎక్కువగా వున్నవి. భరించటం కష్టమని Bangalore ప్రయాణం కట్టింది. ఎవరూ ఏమీ అనలేక వూరుకున్నారు. ఆవిధంగా చిన్న కొడుకూ, చిన్నకోడలూ వెళ్లిపోయినారు. ఇప్పుడు అత్తగారికి ఎవరు మంచిదైనది తెలిసింది. ఇటువంటి పరిస్థితులలో మంచి చేసికొనలేకపోతే గత్యంతరం లేదని పెద్ద కోడలితో ఎంతో ప్రేమగా వుండటం మొదలు పెట్టింది.

చివరకు దుప్పి సామితగా ముందువచ్చిన చెవులే మంచివైనవి.

(౦)

# సంపాదకీయములు

## చేనేత పారిశ్రామికుల సత్యాగ్రహం :

చేనేత పారిశ్రామికులు సత్యాగ్రహం చేస్తున్నారంటే ఎవరికీ ఏమినొప్పియనిపించినట్లులేదు. అదే ఏఫాక్టరీలోనో, ప్రభుత్వసంస్థలోనో జరిగినట్లయిన, తక్షణ కర్తవ్యమును గురించి తప్పక ఆలోచనలు జరిగియుండేవి.

చేనేత పారిశ్రామికులు ఆ వృత్తితప్ప మరొకదానిని చేయలేనివారు. తామావృత్తిని స్త్రీలు, పురుషులు, పిల్లకాయలతో సహా ఎవరికి తోచినపని వారు చేసికొని జీవనంగడుపుకొంటారు. అట్టివారికి నూలు సప్లయిలేకపోతే వారికి జరుగుబాటు ఏలా కావాలో ఆలోచించండి. తిండిలేక ఎండలో నల్లులు మాడినట్లు మాడుతున్నారు. పొట్టపోసుకొనుటకు స్త్రీలు కట్టెలమ్ముకొని కొందరు, దాసీ వృత్తిచేసి కొందరు, చెయ్యరానిపనులు చేయడానికికూడ పూనుకొంటున్నారంటే అతిశయోక్తికాదు.

దీనికి బాధ్యులు ప్రధానంగా ప్రభుత్వమువారు. నూలు సప్లయిచేయించడమో లేక బ్రతుకుతెరువు చూపించడమో, చేయవలసిన బాధ్యతను ప్రభుత్వమువారు గుర్తించకపోవుట విచారకరమైన విషయం.

కాని వారి ఆర్థికదుస్థితికి కొంతవారే కారకులని చెప్పక తప్పదు. మిల్లునూలు కావలసినంత సప్లయి కాని రోజులలో గిజగిజలాడేకంటె నూలువడికి నేయడానికి ఎందుకు పూనుకోరో అర్థము కావడంలేదు. కట్టెలమోపులు అమ్ముకొని కూలివృత్తిచేయుటకంటె నీడపట్టున కూర్చొని నూలువడికి గుడ్డనేయడం గౌరవప్రదమనే మావాదం. పైగా ఆదాయంకూడ మనిషి 1 కి 1-0-0 దినమునకు గిట్టుబాటు కాగలదని గట్టిగా చెప్పగలం. మిల్లునూలు సప్లయి యగువరకు నూలువడికి నేయడం ఉత్తమమైన మార్గం.

## దేశములోని క్షామపరిస్థితులు - స్త్రీలు :

ప్రధాని నెహ్రూ యీనెల 1 వ తేదినాడు రేడియో ప్రసంగములో దేశములోని క్షామపరిస్థితులను సమీక్షచేయుచు ప్రతివారూ వారానికి ఒకపూట ఉపవసించి ధాన్యము మిగిల్చాలని, పేదవారికి ఆహార సహాయం నిమిత్తం గ్రామాలలో సంఘాలు ఏర్పడాలనియు చెప్పుచూ యీదారుణ పరిస్థితులలో అన్య దేశీయులు చేయుచున్న, చేయనున్న సహాయమునకు కృతజ్ఞతను తెలియజేసిరి కాని అట్టి సహాయం మనకు ప్రచ్ఛన్నంగా రాజకీయ బంధకాలేవైన కలిగించాలనీ, మన జాతీయ అంతర్జాతీయ విధానాలను మార్పుచెయ్యాలనిగాని విదేశాలు ప్రయత్నించినట్లయినచో, లేదా స్వతంత్రజాతిగా మన ఆత్మగౌరవానికి హానికలిగించే మరేవిధమైన షరతులను విధించాలని ప్రయత్నించినను ఆసహాయమును స్వీకరించబోమని నొక్కి చెప్పాడు.

పండ్లు, కాయగూరలు విరివిగా పండించి భుజించుటవలన కొంత ఆకలిమంట తగ్గగలదు. ఆరోగ్యమునకు భంగముండదు.

పండ్లు, కాయగూరలు పండించుటలో పురుషులతోబాటు స్త్రీలుకూడ సహకరించి పాటు పడవచ్చును. రష్యాలోని స్త్రీలలో అనేకులు దున్నేయంత్రాలను, నూర్పుయంత్రాలను చక్కగా నడుపగలరు.

అనేకులు వ్యవసాయములో పురుషులతోబాటు పాల్గొని దేశశ్రేయస్సు దృష్ట్యా పాటుబడుతుంటారు. వారిని ఆదర్శంగా తీసికొని స్త్రీలు ప్రస్తుతము ఏర్పడిన క్షామపరిస్థితులనుండి దేశమును కాపాడి ఆత్మగౌరవాన్ని, దేశప్రతిష్టలను కాపాడగలరని నమ్ముచున్నాము.

## ఆదర్శ వివాహం.

మామిత్రులు శ్రీ ప్రొఫెసర్ వేమూరి విశ్వనాథశర్మగారి కుమారుడు చి॥ శ్రీనివాసశాస్త్రికి, మరో మిత్రులు శ్రీ పంచాగ్నుల శివరామయ్యగారి కుమార్తెనిచ్చి చీరాలలో గతమాసం వివాహ మహోత్సవం జరుపబడినది. అన్ని వివాహాలవలెనే ఇదిన్ని చాలా వైభవంగా జరిగింది. అయితే ఈ వివాహంలో విశేషమేమిటంటే సంపన్నులైన కన్యాదాతలు అల్లునిఆశీర్వదించి వరకట్నమివ్వబోగా ప్రాచ్యపాశ్చాత్య విద్యానిధియైన వరునితండ్రి దానికి నిరాకరించాడు. ఇందుకువారిని మేమెంతైనా యభినందిస్తున్నాము - సంపన్న గృహస్థుల ఇండ్ల వివాహాలలో ఇట్టిఆచారం ప్రబలిందంటే సామాన్య గృహస్థుల ఇళ్లుగుల్లచేసే వరకట్నాలకు బలికాకుండా రక్షింపబడుతారు. తగినవరుని కొంకేగదా తల్లిదండ్రులు సర్వస్వం ధారపోసియైనా వరకట్నాలు సమర్పించడానికి సిద్ధపడడం. శ్రీశర్మగారిని వారి సతీమణినిసహా మేము అపూర్వపద్ధతి నవలంబించినందుకు ఎక్కువగా కొనియాడుచున్నాము. చిరంజీవులైన వధూవరులు దీర్ఘాయురారోగ్యైశ్వర్యవంతులై పుత్రపౌత్రపారంపర్యాభివర్ధిల్లుదురుగాక.

## కాంగ్రెసు: ప్రకాశంగారు.

ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారు కాంగ్రెసుసంస్థను వీడిరన్నవార్త వినుటకు కటువుగా ఉన్నది. అందుకు కారణముల నరసి వాటిమంచిచెడ్డలను విమర్శించడంకాదు మాఉద్దేశం. 30 సం॥ లనాడు రెండుచేతులు లక్షలాదిసంపాదిస్తున్న ప్రకాశంగారు వృత్తివిసర్జించి కాంగ్రెసులోచేరారు. కాంగ్రెసు సేవలో తమసర్వస్వం ధారపోశాడు. అంతేకాదు తన, మన అన్నవారికెల్లా అంతో ఇంతో త్యాగం మప్పచెప్పారు. అలాంటికాంగ్రెసును నేడాయనవీడారంటే ఊహకే అందకుండాఉన్నది. ఇందుకు చింతించని ఆంధ్రస్త్రీలుగాని పురుషులుగాని ఉండరు.

## త్యాగరాయనగరం కేసరీ యలిమెంటరీ పాఠశాలాభవనం.

గత అగస్టులో గౌ. సీతారామరెడ్డిగారిచే శంఖుస్థాపన గావింపబడిన త్యాగరాయనగరపు కేసరి యలిమెంటరీ పాఠశాలాభవనం పూర్తియై గౌ. శ్రీగోపాలరెడ్డిగారిచే ప్రారంభోత్సవం జరుపబడినది. దీనినింత త్వరలో నిర్మింపించగల్గిన హైస్కూలు కమిటీవారికి, ముఖ్యంగా వారికార్యదర్శియైన శ్రీదివాన్ బహదూర్ బండి శ్రీహరిరావు నాయుడుగారికి మా అభినందనములు. దీక్ష, శ్రద్ధ, సామర్థ్యము, సమరస భావము, ఓర్పు, నేర్పుగల్గి నెలలో కాదగుపనిని రోజులలో చేయించగలవారు వారు. వారికిలాంటిపనులు చేయడం అనుభవమేకాదు; ఆనందంకూడ వారి హయాములో ఈసంస్థలు దినదినాభివృద్ధి చెందుతాయని మా ఆశ. శ్రీకేసరిగారి ఉత్సవానికి స్వయంగా రాలేకపోవడం విచారకరం; కాని వారి సందేశం సభాసదులందరకీవారిసన్నిధానాన్ని కల్పించినది. కేవలం సభావేదికలమీద ఉపన్యాసాలిచ్చి, పత్రికల నిండా వడగాసి తెలుగుబిడ్డలకు మద్రాసులో తెలుగున చదువుకొనే అవకాశంలేదని అంగలార్చిన మాత్రాన ఆ కొరవతీరదని, దీక్షతో కృషిచేస్తే మంచుకరిగినట్లు అలాగ కరిగిపోతుందని ఈ సంస్థలు ఎలుగెత్తిచాటుతున్నాయి. 11 సం॥లకృషి; రూపురేఖలతో నేడు విరాజిల్లుతున్నది. మంత్రులు సభారంగాన బల్కిన హితవాక్యాలను కార్యరూపానకూడ సమకూర్చగలరని 'ఆశిస్తున్నాము.

---




బారిస్టరు పార్వతీశం: ప్రథమ భాగం, మొక్కపాటి నరసింహశాస్త్రిగారు, మొక్కపాటివారు, మద్రాసు. వెల రు. 1-4-0

'బారిష్టరు పార్వతీశం' పాతిక సంవత్సరాలనుంచీ ఆంధ్రదేశానికి బాగా పరిచయమైనవ్యక్తి. పాతకాలపు హాస్యగ్రంథాలు బూతుల బుంగలని తెలుగువారు మాతులు ముడిచి తల ఓరగిల త్రిప్పుతున్న రోజులలో ఈగ్రంథాన్ని శ్రీ శాస్త్రిగారు వారి చేతికందించారు. ఇది ఇప్పటికి (1951) మూడో ముద్రణమైనదంటే, ఈగ్రంథానికి తెలుగువారెంత ఆదరణ ఇచ్చారో తెలుస్తుంది. నిజంగా ఆంధ్రుల నైజతత్వాన్నిబట్టి చూస్తే, దీన్నిచదివి ఆనందించినవారిలో అంతా కాకపోయినా సగంమంది అయినా పుస్తకం కొని చదివి ఉంటే ఇప్పటికిది పదోముద్రణ అయి ఉండాలి. అయితే విత్తమే కాదు, పుస్తకం కూడ చేబదులు తీసుకోడం మనవాళ్ళకు చెడ్డసరదా. అట్లా ఒక్కొక్క ప్రతి ఎన్నిచేతులలోమారి ఉంటుంది! చదివినవాడెల్లా ఆనందించాడనవచ్చు. కాని పూర్తిగా తెలిసి ఆనందించాలంటే, ఆయా సన్నివేశాలలో తప్పేమిటో తెలుసుకోగలిగినంతగా ఆదేశపు,సంఘపు,ఆధునిక కాలపు సాంప్రదాయాలుకూడా తెలిసిఉండాలి. శ్రీశాస్త్రిగారు ఆరోజుల్లో ఇంగ్లండుకెళ్లి ఏడిగ్రీ పుచ్చుకోకుండా తిరిగివచ్చిన వారిలో ఒకరు. కాని ఆయన అనుభవాలను ఈవిధంగా వ్యంగ్యంగా చిత్రించి శాశ్వతంగా ఆంధ్రదేశంలో నిలిపేశారు. త్వరలో శ్రీశాస్త్రిగారు రెండవభాగం కూడా వ్రాస్తే బాగుండును. కాలం మారిపోతున్నది. నిన్నటి ఇంగ్లాండు కాదు నేడు. భారతీయుని దృష్టిలో క్రమంగా అది మార్పు చెందుతున్నది, చెందుతుంది. పాతికేళ్లనాడు ఇందులో వ్రాసిన కొన్నిఘట్టాలు అప్పుడే పేలవంగా తోస్తున్నవేమో! కాబట్టి శ్రీశాస్త్రిగారు రెండవ భాగమున్నూ త్వరగా వ్రాయాలి.

కాదంబిని: శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు. కవితా సమితి, విశాఖపట్నం. వెల రు 1-4-0

అంతంత కవులు, పూర్వులుగాని, ఆధునికులుగాని కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రశంస లందుకోవడం దుస్సాధ్యం. దానికాయన రచించిన కవిత్వ తత్వవిచారమే సాక్షి. కాని శ్రీమతి రుక్మిణమ్మ గారు అంతటి నోచుకున్నారు. రెడ్డిగారు అనకాపల్లిలో "కాదంబిని" నుండి కొన్ని పద్యములు చదివి వినిపింపబడిన సభకధ్యక్షత వహించి ప్రశంసించుటేకాదు; రుక్మిణమ్మగారి ఈకవితా కన్యకు సరసుడు 'తిలకం' దిద్దినాడు.

"హృషితాంతరంగు జేసెనను కల్మష హారణకులైన నీసమంజస ఫణితుల్" (భారతం)

అని తిక్కన పలుకులలో రెడ్డిగారీమె కవితామాధుర్యమునకు సాక్కిపల్కినారనగా దానినింకా ప్రశంసిస్తే మొగం మొత్తుతుంది. ఈమె రచనాపద్ధతులను కవిత్రయము పోకడలతో పోల్చిచూపి, ఇంత

కన్న విశేషము నరసిచూప "నాకు పాండిత్యము తక్కువ" అని వినయము నటించినారు రెడ్డిగారు. అంతటితో యూరకొనక "ఇందలి భావములు పాతాళమంతలోతు, ఆకాశమంత పొడవు" అని కవితములందు భావమునకై ప్రాకులాడు రెడ్డిగారు సంబరపడినారు. ఆమెకు తిలక రచనా సందర్భమున వ్రాసిన ఉత్తరంలో-

ఆధునిక కవయిత్రులలో నీసాటివారులేరు; పురుషకవులతో పోల్చిన అగ్రశ్రేణి వారిసరసన నిలువదగిన దానవు అని వ్రాసినారు. ఇంతవ్రాసినను శ్రీరెడ్డిగారికి తనివి తీరినదని తోచదు. అదియే శ్రీమతి రుక్మిణమ్మగారి విజయధ్వజము. ఈఖండకావ్య సంపుటము - రెడ్డిగారు సరిదిద్దినట్లు "హాస్యకార్య సంపుటి" సర్వజనాదరణీయము. ఇట్టిఉత్తమ కావ్యములు పాఠ్యగ్రంథ నిర్ణయ సంఘమువారి కేల సులభముగా కన్పించవో; పాపము! బహుశా, వారి పరిశీలనకువచ్చు అసంఖ్యాక గ్రంథ సామగ్రి అడుగున పడిపోవుచుండునేమో ఇట్టివి! అవును; ఆపుస్తకములను దొంతరలుగా పేర్చువారు వానిలోపల నున్న పదార్థమును ఎన్నడును అంటరు; ముట్టరు; శీలవంతులకు జవానులు గదా. రా. వెం.

## నాడు, నేడు: ఇది నాటికాద్వయం, రచయితలు మిత్రబృందం, ఏలూరు.

మొదటినాటిక పోతన. నైతికంగా దిగజారిపోతున్న యీరోజులలో ప్రజలకు వ్యక్తిత్వము, ఆత్మగౌరవముల యొక్క విలువను ప్రబోధించగల రచన. నిరంకుశత్వాన్ని అవసరమైతే ధిక్కరించుటకు కావలసిన మనోస్థైర్యాన్ని ప్రకటించారు యీనాటికలో రచయితలు.

రెండవది పదిరూపాయిలు. ఇది ఒకకవి నిర్భాగ్యజీవితాన్ని చిత్రిస్తుంది. అనేక గ్రంథాలువ్రాసి, అనేక మన్ననల పొందాడు కాని తనబిడ్డ చావు బ్రతుకులతోనుంటే యీకవికి మందుకు 10 రూపాయిలు లేకపోయినవి. ఇందులో భర్త నిస్పృహ చెందుతున్నప్పటికి భార్య ఓర్పును బహుచక్కగా చిత్రింపబడినది.

ఈచిన్నపుస్తకము చదువుటకు చాల ఉత్సాహకరముగాను, సరళముగానున్నది.

## రేషనింగు కథలు: జ్యోతికుమారి. ఫన్‌లాండు ఏజన్సీస్, కర్నూలు.

రేషనింగు అంటే ప్రతివారికి చీమలు పారకాడినట్లుంటుంది. దానిమూలంగా సామాన్య ప్రజానీకం పడేబాధలు యీచిన్న పుస్తకములో వివరించబడినవి.

రేషనింగు ప్రవేశపెట్టిన ఉద్దేశమునకు, ప్రస్తుతపు పరిస్థితులకు సంబంధములేదు. లంచగొండితనం ప్రముఖపాత్ర వహిస్తున్నది. చీకటిబజారు వ్యాపారం నిరాఘాటంగా సాగుచున్నది. ఈసమస్యలను యిమిడ్చి వ్రాసిన యీచిన్న కథలపుస్తకము సహజమైన ధోరణిలో సామాన్య ప్రజలకందుబాటులో నున్నది.

## పురుషోత్తముడు: శ్రీతడికమళ్ల కోటేశ్వరగుప్త, త్రిపురమల్లు లక్ష్మయ్య గుప్తగార్లు. రు 0-4-0

ప్రసిద్ధ పురుషుల చరిత్రలను నాటకరూపంలో చదువుటకు చాల ఉత్సాహకరముగా నుండును. ఈచిన్నపుస్తకమునందలి కథావస్తువు అలెగ్జాండరుతో పోరాడిన పురుషోత్తముని చరిత్ర. దీనియందలి భావ, భావములు సుగమములుగా నున్నవి. ఇట్టిపుస్తకముల పఠనము వలన చరిత్రజ్ఞానము అధికమగుటయేగాక ఉత్తమపౌరులు తయారగుట కుపకరించును.

స్వీకారము



**పూదోట:** శ్రీ కల్లూరు అహోబలరావుగారు, కృష్ణదేవరాయ గ్రంథమాల, అనంతపురం. రు 1-0-0.

పూదోటయందనేక రకముల పుష్పములు వాసనలు వెదజల్లునట్లు యీచిన్న పుస్తకము నందలి పద్యములు చక్కని భావములతో, సరళమైనభాషతో నొప్పుచున్నవి. ఇందు మహాత్మాగాంధీ భావములకు జోహారులర్పించి, రాట్నము, జండా, కృష్ణదేవరాయలు, ఈశ్వర విచారణ మొదలగు వానిని కవివస్తువుగా గ్రహించి చక్కగా నిర్వహించిరి. ఈచిన్న పుస్తకము ఆంధ్రుల అభిమానపాత్రము కాగలదని నమ్ముచున్నాము.

**చూడాల:** శ్రీబిట్రా ఆంజనేయులుగారు, తాడికొండ వెల రు 1-4-0

చూడాలయోగ వాశిష్టమనెడు గ్రంథమునుండి గ్రహింపబడిన కథ, దీనిని గ్రంథకర్త పద్యరూపముగా రచించినాడు. ఇదిభగవద్గీతా బోధనల ననుసరించి ప్రతిఫలాపేక్ష లేకుండా వారి వారి ధర్మములను నిర్వర్తించవలెనని బోధించుచున్నది. ఈగ్రంథము రాగ విలాసము, ప్రబోధవిలాసము, లీలావిలాసమనెడు మూడు భాగములుగా భాగించబడినది. ఇది చదువరులను ఉల్లాసవంతులను చేయుటయేకాక గంభీరమైన సూచనలతో నొప్పుచున్నది.

సి. సి. పున్నయ్య.



## శ్రీ ఖరనామ సం॥ర వైశాఖ, జ్యేష్ఠమాసములు.

| | | | |
|---|---|---|---|
| మే నెల | 16 | బు | ద 32.15 పూఫ 9.40 దివి 27.57 |
| | 17 | గు | ఏ 31.5 ఉఫ 10.37 ది 31.33 |
| | 18 | శు | ద్వా 28.42 హ 10.27 ది 30.0. పరశురామద్వాదశి. |
| | 19 | శ | త్ర 25.10 చి 9.6 ది 22.33. త్రయోదశీతిథిః నృసింహజయంతి. |
| | 20 | ఆ | చతు. 20.37 స్వా 6.43 వ 20.37 దివి 19.57 |
| | 21 | సో | ○ పూ. 15.16 విశా 3.26. ది 2.46. |
| | 22 | మం | పా 8.59 జ్యే 51.42 ది 13.31 |
| | 23 | బు | వి 2.42 ఏష్యా 53.29. మూ 50.20 ది 13.21 |
| | 24 | గు | చ 9.44 పూ.షా 45.56 ది 12.34 సంకటగణేశవ్రతం. |
| | 25 | శు | పం. 43.37 ఉషా ది 4.35 |
| | 26 | శ | ష 38.27 శ్ర 38.31 రా 15.51 |
| | 27 | ఆ | స 33.55 ధ 35.56 రా 21.15 |
| | 28 | సో | అ 30.26 శత 34.27 రా 18.6. కర్తరీత్యాగం |
| 1951 సం॥ | 29 | మం | న 28.1 పూ.భా 34.1 రా 26.9 |
| | 30 | బు | ద 27.3 ఉభా 35.2 హనుమజ్జయంతి. |
| | 31 | గు | ఏ 27.15 రే 37.8 సర్వోపవాసః |
| | 1 | శు | ద్వా 28.35 అశ్వ 40.18 ది 29.59 |
| | 2 | శ | త్ర 31.3 భర 4.30 ది 5.58 |
| | 3 | ఆ | చతు 34.322 కృ 49.35 ది 17.2 మాసశివరాత్రి |
| | 4 | సో | ● అమా 38.19 రో 55.8 రా 0.57 సోమవారవ్రతం |
| | | | జ్యేష్ఠమాసం |
| జూన్ నెల | 5 | మం | శుపా 42.39 మృ 60.10 ది 9.31 |
| | 6 | బు | వి 47.9 మృ 1.5 దివి 24 11 చంద్రోదయం |
| | 7 | గు | త 51.27 ఆర్ద్ర 7.6. రా 7.37 రంభావ్రతం |
| | 8 | శు | చ 55.20 పున 12.52 రా 2.16 |
| | 9 | శ | పం 58.11 పుష్య 18.9 రా 20.27. |
| | 10 | ఆ | ష 60.10 ఆశ్లే 22.41 రా 22.6 అరణ్యగౌరివ్రతం |
| | 11 | సో | ష 1.5 మఘ 26.16 రా 14.2 |
| | 12 | మం | స 2 57 పూఫ 28.46 రా 14.44 |
| | 13 | బు | అ 2.30 ఉఫ 70.5 రా 18.42 బుధాష్టమి |
| | 14 | గు | న 1.24 ఏష్యా 57.27 రా 17.25 |
| | 15 | శు | ఏ 55.8 చి 29.11 వ 26 58 నిర్జలఏకాదశి |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

